మానవసేవాగ్రంథమాల 22

# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాపత్రికయందు

ప్రకటింపఁబడియె

రాజమహేంద్రవరము.

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1913

వెల 4 అణాలు.

# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాపత్రికయందు

ప్రకటింపబడినది

రాజమహేంద్రవరము.

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

వెల 4 అణాలు.

# విజ్ఞాపన

సంస్కృతభాషయందును నాంగ్లేయభాషయందును బూర్వమహాకవివిరచితము లైనకావ్యములనుండి నీతిని ధర్మమును బ్రబోధించుపద్యముల నెత్తి ప్రత్యేకగ్రంథముగఁ బ్రకటించి లోకమునఁ బ్రకాశింపఁ జేయునాచారము కలదు. మన యాంధ్రభాష కట్టి భాగ్యము లభించినది కాదు. ఈకొఱఁత నివారింపఁ బూని కొందఱు భారతమునుండి మాత్రమే కొన్నిపద్యముల నెత్తి ప్రకటించిరి. ఆంధ్రభాషలో ధర్మము లను తరఁగలు తాండవమాడు మహాప్రవాహమునవలె కవిత్వముఁ జెప్పి విద్వాంసహృదయ కమలముల వికసింపఁజేసి కీర్తిఁ గాంచినకవిభాస్కరు లెందఱో కలరు. అట్టివారిగ్రంథ ములనుండి నీతివాక్యముల నెత్తి వేఱుగ్రంథముగఁ బ్రకటింప వలయు ననుతలంపు గలు గుటచే నే నీకార్యమునకు దొరకొని "ఆర్యసూక్తిముక్తావళి" యనునామ మిడి మును ముందు కావ్యరాజ మని ప్రసిద్ధిఁ గాంచిన భారతములోని నీతిపద్యములఁ బ్రకటించితిని. మఱియుఁ దెనుఁగునఁ గలపురాణములనుండియు మహాకావ్యములనుండియు నీతిపద్యము లీగ్రంథమునందుఁ బ్రకటింపఁబడును. భారతములోనిపద్యములు పూర్తి జేసి యీగ్రంథ మును బ్రథమసంపుటముగఁ బ్రచురించితిని. ఇఁకముందు రాఁబోవు మామానససేవాసంపు టములలో భాగవతము రామాయణము మున్నగు నాంధ్రగ్రంథములనుండి నీతివాక్యములు ప్రకటింపఁబడును. కావున నెల్లరు నిట్టిగ్రంథములఁ జదువవలయు ననియుఁ దెనుఁగు గ్రంథములలోఁ గల నీతుల వెలయింపఁ జేయు నిట్టిగ్రంథములే దేశాభివృద్ధికరము లని తెలిసికొని యాదరింప వలయు ననియు, లోకజ్ఞానము గలిగి దయాసత్యశౌచములతోఁ గులతూఁగుచు దేశమును వెలయింపఁ జేయుట మానవస్వభావము కావున నట్టి స్వభావ నిరూపణము సేయునట్టిసాధనము లుపాయము లని తెలిసికొని యెల్లరు నాదరింపవలయు ననియు కోరుచున్నాఁడను.

ఇట్లు,

రాజమహేంద్రవరము.
29—3—1913

సజ్జనవిధేయుఁడు
సత్యవోలు అప్పారావు.

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తనదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పుసేయు. 1

క. అలిగిన నలుగక యెగ్గులు
వలికిన మఱి వినినయట్ల ప్రతివచనంబుల్
పలుకక జన్నము వడి యెదఁ
దలఁపకయున్నతఁడు సూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము, శత్రునకునైన
నిచ్చుటయు లెస్స యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి తపిఁగి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రా రెంటినిఁ జెఱుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడు,
పేదవడియును నర్థికి బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య! 5

క. జనులకు నోడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినవైయుని కలిమి కులుకక
మనుజులలోఁ బొందిపొసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్తమైన వెలయు

నాథ ! శిష్టచరితలందు సత్యము కడు
నధిక మనిరి శాస్త్రతతుల నరసి బుధులు. 7

క. పురుషుండను రెండక్షరముల
ధర నాత్మకు దనకుఁ బరఁగు వా నెయ్యెడలం
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వైరయు పనులు దొరఁగుటవలనన్. 8

ఉ. ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థమున్
జేరి యయుఁ గాంచి ధర్మవిధిఁ జెంద్రియుఁడై ప్రజలన్ సృజించి స
త్కర్మములు బ్రశస్తములుగాఁ గ్రతువుల్ నొనరించు సజ్జనుల్
ధర్మజ ! యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్. 9

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ; నిందియుఁ గడు మే
లొనరించు ; గీ డొకింతక
యును దనకెసఁ దోపనీక యొసఁగుచువచ్చున్ 10

సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము నార్జవముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయననిరతి
దాంభికత్వము లేమి దైన్యంబు వైరయమి యనసూయ యనహంక్రియాభియుక్తి
దలపంగ నాద్యమై తనరు ధర్మము సెప్పు గొనియుండు నాస్తికగోష్ఠి జనమి
గీ. శీలసంపత్తి తీర్థసంసేవ శౌచ
మఖిలభూతములందు దయార్ద్రిఁ దగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి
యున్న యును శిష్టచరితంబు లిద్ధచరిత ! 11

శా. ఆలస్యం బొకయింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమర, మర్చనీయు లతిథుల్, సత్యంబ పల్కుంబడు న్,
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాల్తు మస్లోట నె
క్కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొంద మే మిమ్ములన్ 12

చ. ఎకపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁబూన, రె
1 య్యెడలను డంబలం గిరుణ యేర్పడఁ బోవన చూతు, రిచ్చచో
గడమపడంగనీ రెదిరి కాంక్షితముల్ తుదముట్టఁ దీర్తుఁ, రె
వ్వఁడు మదిఁ గూర్తు రాశ్రితులనన్ విను మిన్నియు నార్యధర్మముల్. 13

భారతము.

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తనుదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు పలుకమి, యిచ్చి పగవ
కునికి, దన కెంత నడపకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పుసేయు. 1

క. అడిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి పనిపినట్లు ప్రతివచనంబుల్
పలుకక యన్నము వడి యెదఁ
దలఁపకయున్నతఁడు నూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడుప మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట యోగము, శత్రునకునైన
నిచ్చుటయ తెన్ను యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి తపియించి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రారెంటినిఁ గెలుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు నైగణ సేయనేరఁడు,
పేదపడియును నర్థికి బ్రియములాడఁ
దనకుఁ గలభంగి నిచ్చుచుండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య! 5

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినయెడని కలిమి కులుకక
మనుజులతోఁ బొందిపోసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మపరత కొల్లను పేటి
యునియు సత్యయుక్తమైన పలుకు

అనఘ ! శిష్టచరితలందు సత్యము కడు
నధికమని శ్రుతుల నగని బుధులు. 7

క. పురుషుండు కెంతతెలుఁగుల
ధర నాత్మయుఁ దనఁగఁ బరఁగు దా నెయ్యెడలం
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వైరయు పనులు దొరగుటవలనన్. 8

ఉ. ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థమున్
జేరి యుఁ గాంచి ధర్మవిధిఁ గాంక్షయునై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ వొనరించు సజ్జనుల్
ధర్మజ ! యింపు నొందును ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్. 9

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ; వెండియుఁ గడు మే
లొనరించు ; గీడొనరించుక
యును దన దేసఁ దోఁపనీక యుడుగుచునచ్చున్ 10

సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము వాక్యనముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయనవిరతి
దాంబికత్వము లేమి దైన్యంబు వెరయమి యనసూయ యనహంక్రియాభియుక్తి
దలపంగ వాద్యమై తనరు ధర్మము సెప్పు గొనియుండు నాస్తికగోష్ఠి జనమి

గీ. శీలసంరక్ష తీర్థసంసేవ శౌచ
మఖిలభూతములందు దయార్ద్రి దగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి
యిన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత ! 11

శా. ఆలస్యం బొకయింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమర, మర్చనీయు లతిథుల్, సత్యంబ పల్కుంబడున్,
మేలై శాంతియు బ్రహ్మచర్యమును సెప్పుందొట్టు పుణ్యాటనే
కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొంద మే మిమ్ములన్ 12

చ. ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁబూన, రె
3 య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు, రిచ్చుచో
గడమపడంగనీ రెడరి కాంక్షితముల్ తుదముట్టఁ దీర్తు, రె
ప్పుడు మదిఁ నూర్తు రాశ్రితులనేన్ ఘను లిన్నియు నాగ్యధర్మముల్. 13

భారతము.

ఉ॥ నీతిపథంబునన్ బ్రతుక నేర్చుట యుత్తమభంగి; శౌర్యసం
జాతములై కరం బరుదు సంపద లొందుట మధ్యవృత్తి; య
స్ఫీతములైన భారవహజీవనముల్ దలపం గనిష్ఠముల్;
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్ 14

క॥ అరిదివిలుకాని యుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పిచనినం జను; నే
ర్పరియైనవాని నీతి, స్ఫురణము పరరాజు నతనిభూమిం జెరుచున్ 15

మ॥ చిరముగ ధర్మమున్ నడపఁ జిత్తము దేలుఁ; బ్రసన్నచిత్తుఁడై
పరువడి నింద్రియార్థములభంగులు రిత్తలుగా నెఱింగి చె
చ్చెర నవి యంతవట్టు నిరసించి తపోబల సత్యశీలతం
బరిణతినొంది పొందుఁ బిదపం బరమార్థపదప్రభావమున్ 16

క॥ ధనమును విద్యయు వంశం, బును దుర్మదులకు మదంబు బొనరించును, స
జ్జనులైనవారి కడకువ, యును వినయము నదియ తెచ్చు నుర్వీనాథా 17

మ॥ అనఘ దయే ప్రియం బనఁగ నార్యులు నిల్వ రదేని? నార్యులే
మదిఁ దలపంగ వారలు నసంచితధర్మము వల్ల కేని? న
ట్టిదియును ధర్మవేదిగ ఘటించిన నిక్కము లేనిదేనిఁ? దా
పవిలపునిక్కమే యొక నెపంబిడు చొప్పున కేని భూవరా? 18

క॥ శోక భయస్థానంబు ల, నేకంబులు గల్గెను ప్రహీనవివేకం
బౌమలకుఁ బొందునట్లు వి, వేకముగలవాఁడు బుద్ధికలుం డగునే? 19

క॥ తెలిసి కులధర్మము విడువక, మనుట పరమధర్మ మిందురు మాన్యులు; చిత్తం
బునఁ గృపగలుగుట ముఖ్యము, గని; సైరణవలయు నఖిలభావములందున్ 20

గీ॥ పాపములకెల్ల నెక్కుడుపాతకములు, సువ్వె క్రోధ మోహంబులు, సుప్రశాంత్మ
వానినంతటి జయించినవాఁడు కాని, యెంచ బాహ్యధార్మికుఁడని యెన్నఁబడఁడు 21

గీ॥ వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు ప్రల్లదంబును, దండంబు పరుసదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత, యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల 22

క॥ చెలిమియు సంభాషణమును, దలిమిపి వాదంబుఁ గ్రోధుబాడియుఁ దన యం
తలవారితోనె తగునది, కులహీనులతోడ నైనఁ గొఱగా దధిపా 23

తే. వార్తయందు జగము వర్తిల్లుచున్నది, అదియు లేనినాడ యఖిలజగము
నంధకారమగ్న మగు నట్లు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి 45

తే. కార్యగతుల తెఱంగుఁ గలయూపు జెప్పిన, నధికమతులు దాని నాదరింతు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు విషము వోలె 46

క. ధర్మజ్ఞులైన పురుషులు ధర్మమునకు బాధసేయు ధర్మువు నెందుం
ధర్మముగా మది దలపరు, ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్ 47

క. తగు నిది తగ దని యెఱిఁగియు, వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల, కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్ 48

క. నరనాథుఁ గొలిచి యలవడ, దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువలేమిన్
మరియాదఁ దప్ప మెలఁగిన, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే! 49

క. పలుమరు శపథంబులు, నం, జలులును, నభివాదనములు, సానప్రియభా
షలు మిథ్యావచనంబులు, గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్ 50

ఆ. కారణంబు లేక దారుణంబుగ సాధు, హింస సేయు కుజనుఁ డెల్ల వారి
కప్రియుండ కాక యప్రియులకునుం, బొందు కలదె తలఁప నుత్తములకు 51

క. నెమ్మి గలవారి నెల్లరు, నెమ్మెల్ల నివాఁ వెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి తోడరు, నెమ్మెలుఁగనియట్టివారి లిథపురనాథా 52

క. రోషము శోకము, రాగ, ద్వేషము లభిమాన దర్పవేగాలస్యా
శ్లేషము లజ్ఞాన మని ము, నీషిజనము సెప్పు మాననీయచరిత్రా! 53

ఆ. సకలపుణ్యకర్మచయమును నొకదెస, వినుము పాడిదప్పకునికి నొక్క-
వలను దీని శ్రుతులు దెలిపెదునెడఁ బాడి, కలిమియందు నెట్ట గాని పించె 54

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్
గురుతరమోక్షధర్మమునకుం దలపం దనప్రాప యూంత; భూ
వర! విను ఘోటకంబునకు వాగెయు, దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్ 55

భారతము

తే. మిత్రసంపన్నుఁడైన నమిత్రమిత్ర । బలముతోడస భేదించు బలముఁ జలముఁ
గలిగి దేశబలంబును గాలబలము । గలుగువాని కసాధ్యంబు గలదె యెందు 56

క. సత్యంబు బ్రహ్మచర్యము । నిత్యశుచిత మౌన మతులనియమము దయ శు
ద్ధత్యాగంబుఁ దపస్సం । పత్యాకృతు లండ్రు బుధులు పౌరషముఖ్యా 57

క. మృదుభాషణముల దుర్జన । హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? యె
ల్లిదముగఁ గొని యంతంతకు । మద మెక్కుం గాక దురభిమానము పేర్మిన్ 58

తే. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి । దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మత్తవృత్తి వర్తించునట్టి । వాని గురువైన దండింపఁదలయు నండ్రు 59

చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిఁటికంటె నూనృత
వ్రత యొకబావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు, తత్క్రతుశతంబులకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్ 60

చ. ధనపతితో చరిమ్రినచుఁ, దత్త్వవిదుం డగువానితోడ మూ
ర్ఖునకుఁ, బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్, రణశూరుతోడ భీ
రునకు, వరూధితోడ నవరూధికి, సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు, నెవ్వనంబునను సఖ్యముఁ దా నొడఁగూడ నేర్చునే? 61

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నోంపది యొంటియున్న య
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి యున్న బాధలం
బొరయునె? యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు, లట్లు గా
కిరవయి నిల్చినం గొని కెల్లిదమై పటివోదు రెంతయున్ 62

తే. బలముఁ గలవానిఁ బలువురు బలవిహీను । లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి,
మనుష్యుఁ గొన నుత్సహించిన మనుజు బట్టి । కుట్టి నిర్జించు మనుకరకులము నట్లు 63

క. అలఘుబలశకరివోదా । స్థూలకాయను బలము లేక దోర్గర్వముమై
గెలువఁగ నశమె సహాయుల । కలిమి ననంతరంబు లగుపగొనసైన్యములన్. 64

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయఁ బ్రభంగులె మందు గాక, ని
ర్మాయత నల్లసిల్లెడుపరాక్రమశీలురు గల్గు నెట్లు? దై
తేయులు తొల్లి మాయల నతిప్రబలాత్మకులైనఁ దద్వధో
పాయములం జయింపరె నృపాలక! శిష్టుఁడు నింద్యుఁడౌఁ దగన్. 65

ఆ. వె. పగయు కలిగెనేనిఁ బామున్నయింటిలో | నున్నయట్లు కాక యూఁరడిల్లి
యుండు నెట్లు చిత్త మొకమాటుఁ గావున | వలన దధికకర్షు వైరశాంతి. 66

క. బాలుఁ డనితలఁచి రిపుతో | నేలిదమునఁ గలసి యునికి యిది కార్యమె యు
త్కీలానలకణ మింతక | సోలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. 67

క. మనుజులకు నెవ్వఁడంబున | ననతిక్రమణీయ మైనయాపద్విషయం
బున సంతాపింపంగాఁ | జన దని యెఱిఁగియును దగునె సంతాపింపన్. 68

క. ధృతి యారోగ్యము నొసఁగును | ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు, ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ గాలగత్యా | గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా. 69

క. కడునధికుతోడఁ దొడరినఁ | బొడిచిన నొడిచినను బురుష పురుషగుణం బే
ర్పడుఁ గాక హీను నొడుచుట | కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెప్పుమా? 70

క. బలహీను లైనవారలు | బలవంతుల నొడుచునప్పుడు బహుళసమాగా
బలములఁ జేయుట యెందును | గలయదె, యాజయము కాదె కర్తవ్య మిలన్ 71

క. విను పురుషుఁడు గావింపని | పనులకు దైవ మది యెట్లు ఫల మొసఁగించున్
జనములు కార్యము నడుపఁగ | ననుకూలత నిచ్చుఁ గాక యయ్యైఫలముల్ 72

తే. పౌరుషమ్ము ధైర్యంబు తోడ్పాటు లేక | ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర!
విత్తు సహకారి గాకున్న రిత్త నేల | వంధ్య మగుగాక, తా ఫలవంత మగునె 73

తే. మేలు రెండులోకంబుల మేలు తెచ్చు | గీడు సేయఁ బడంపడి కీడ యగును
గాన పురుషవర్తనమునే కానుకూల్య | శీల మగ దైన మది ఫలసిద్ధిఁ జేయు. 74

క. చెలిమియు సంభాషణమును | బలిమి వివాదంబుఁ దోఁపుఁ బాడియు సమయం
తలవారితోన తగునవి | కులహీనులతోడ నెన్నఁ గొలఁగా వసుధా. 75

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠలాభము । ప్రజ్ఞయ నాకం బసంగఁ బ్రజ్ఞయ మవ్వే
ప్రజ్ఞయ కైవల్యదమును। బ్రజ్ఞాసాధ్యములు కాని పనులుం గలవే. 76

క. గురుకొని కార్యాకార్యము । లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁ డగునేనిన్
మఱవక గురు నైనను జను । లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్ 77

క. ధీరమతియుతులతోడ వి । చారము సేయునది మును విచారితపూర్వ
ప్రారంభ మైనకార్యము। పారము వొందును విఘాతపదమూర్గంబై. 78

ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధియించువిధంబున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరిరక్షణశక్తి నెల్లకా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్థము, మంత్రవిభేద మైనఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను నేరఁ బోలునే 79

క. తన కపకారము సేసిన। జనుఁ దల్పిం డనుచు నమ్మి జడమతియై చే
కొనఁ జన దించుకము ల్లయి । నను బాదతలమున నున్న యనడఁగ నగునే. 80

చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నోడిచియు సర్వ మిచ్చియు జనున్ జననాథకృతాపరాధులం
గడఁగి వధింపఁగా వనుట కార్యముగం బిది గాన నెట్టులుం
గనుకొని శత్రులం దెలుపఁగాంచుట కార్యము రాజనీతి మై. 81

క. మొనసి యపకారిఁ గనని చేఁ । కొనియుండెడుసుమతి దీర్ఘకుజశాఖాగ్రం
బుననుండి నిద్రవోయెడు। ఘనుజనకు సమానుఁ డగుఁ బ్రమత్తత్వమునన్ 82

క. తన కిమ్ముగునంతకు దు । ర్జనుఁ డిష్టుఁడపోలె నుండి సర్వముఁబో లైన్
దన కిమ్ముగుడును గఱచును । ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రలచేత 83

ఆ. కీర్తిలేనివానికిని జీవనంబు ని । రర్థకంబు నూనె యవనిమీఁద
నిత్య మయినధనము నిర్మలకీర్తియ । యట్టికీర్తి నడయు టశ్రమంబె. 84

క. ఇలఁ గీర్తి యెంతకాలము । గలిగి ప్రకీర్తిల్లు నంతకాలంబును ని
త్యులు గారె గీర్తిగల పు । ణ్యులు, కీర్తిహీనుఁ డెంగనుఁ బూజ్యుండే. 85

క. ధీరమతియుక్తిఁ జేసి వి । చారింపఁగ నిక్కమంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం । బారఁగ ధర్మంబ చూవె యతిరమ్య మగున్. 86

ఉ. శత్త్రుల నాజి నోర్చుటయు, సర్వభయంబులఁ బొందకుండఁగా
ధాత్త్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం, బ్రియంబుతోఁ
బాత్త్రుల కర్థ మీగియును, బ్రాహ్మణపూజయుఁ జూవె యుత్తమ
క్షత్త్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 87

చ. అరదము దేహ, మింద్రియము లశ్వము, లాత్ముఁడు సూతుఁ, డిమ్మహా
తురగచయంబు ధైర్య మను తోరపుబగ్గములన్ దృఢంబుగా
నురుపటిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువున నేఁగు, నప్పరమ ధీరుఁడు సువ్వె యుదారుఁ డెయ్యెడన్. 88

తే. ఇంద్రియంబులు దిగిచినయెడకు బాఱు। చుండు మనసెప్డుఁ దద్వేగ ముడుపకున్న
వెడలి చెడిపోవు బుద్ధి యుద్దీప్తపవన।హతిఁ బయోనిధిలోఁ గల మఱియు నట్లు 89

మ. అసుఖాకారత నిద్ర దైన్యము విమోహం బక్షమత్వంబు దా
మసభావంబులు, రాగలోభజడతామానంబు లూహింప రా
జసవృత్తంబులు, ధైర్యశాంతికరుణాసంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు,నిజం బిట్లాత్మ గన్గొన్నియున్ 90

చ. అనఘుఁడు సాత్త్వికుం డగుమహాత్ముఁడు బోధనిరూఢిఁ దత్త్వముం
గనుఁగొని లోకవృత్తములు గా వని రోసి సమస్తసంగముం
గనిరసుఁడై తొఱంగు మమకారవికారమహంక్రియాచ్యుతిం
బమపక్షి సంయమప్రకటభావన నుత్తమశాంతిఁ గైకొనున్ 91

క. కామంబును గ్రోధంబును । నేమఱక జయింపవలయు నెల్లవిధముల్లన్
ధీమహిత! యిదియ సతత। క్షేమంకర మైనపథము కృతబుద్ధులకున్. 92

క. చేతనరహిత క్షేత్రముఁ । జేతనముం బొందఁ జేయుజీవాత్మ దశా
తీతుఁడు పరమాత్ముఁడు దా। ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్రకల్పనుఁ డనఘా. 93

—భారతము—

మ. విలసద్ధర్మవిశుద్ధకృత్యులు భయోన్ముద్ధుల్ సుశాస్త్రీయబు
ద్ధులు మధ్యస్థులు గార్యనిర్ణయసమర్థుల్ మానమాత్సర్యదూ
రులు నాఁ జాలినవారిపల్కులకు వైరుద్ధ్యంబు గావించున
జ్ఞులు భూనాథుల కాప్తులున్ సఖులు నై శోషింతు రత్యంతమున్ 94

క. అరయఁగ విషయము లెంతయు, దురంతములు వానియందుఁ బొడరినఁ జేటుం
బొరయుదురు దొడరకున్నం, బరమపదవి యమ్మహానుభావులకు నగున్. 95

తే. వాఙ్మనఃకాయములు శౌచవంతములుగ, జేసికొని యనహంకారశీలశాంత
బుద్ధిరై నిరపేక్షతఁ బొంది యఖిల, భూతదయ గల్గి మెలఁగంగ బోధ మొందు 96

క. క్షమయును సత్యంబును శౌ, చమును సుధర్మములు బ్రహ్మచర్యం బత్యు
త్తమధర్మము వానికిఁ జి, త్తము నలవఱుపంగవలయు ధైర్యము పేర్మిన్. 97

తే. అర్థవంతుఁ డై భోగంబు లనుభవించు, చున్న యప్పుడ యివి యిట్టు లుండ నేర,
దస్థిరము తాను లోనుగా ననియెఱుంగు, నతఁడు వగఁ బొందఁ డేవియెల్లైన నధిప. 98

క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడ, ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁజేయున్
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలంగున్. 99

క. దోష మరసి కామంబును, రోషంబును లేక తగినరూపునఁ జేయం,
బోషక మగు ధర్మమునకు, వైషమ్యవిహీన మైనపథము కుమారా. 100

క. విమలజ్ఞానముఁ దపమును, దమమును ద్యాగంబు శాశ్వతప్రమదానం
దములకు మూలము లండ్రు ని, జముగాఁ గైకొండ్రివియ ప్రసన్నవివేకుల్. 101

క. జ్ఞానంబు నాశ్రయించిన, వానికి నేపనులఁ గీడు వాటిల్లదు ప్ర
జ్ఞానరహితుండు కామా, ధీనత మెయిఁ గర్మసమితిత్రిప్పులఁ జిక్కున్. 102

క. విను మచిరవృత్తిఁ జేసిన, పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం
బనఘా! చిరభావితము, ద్దినిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్. 103

క. కార్యవిచారము చిరముగ, ధైర్యముతో నడపవలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁడని, యార్యులు సేయుదురు నిశ్చయంబు చిరముగన్ 104

క. మిత్రత్వము శత్రుత్వము, బాత్రతయు నపాత్రతయును బరికించు నుచా
రిత్రుఁడు చిరతరగణనా, సూత్రితముగ దాన నెల్లశుభములు నొందున్. 105

చ. వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నొ
ప్పు నెఱయుహస్తియందు నొకపోకకుఁ బోవనికుక్కయందు దా
ని నరిచి తెచ్చి వండి తినునీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు ప్రశాంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్. 106

క. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబుగ దానిన్
రాజాన్వయ! రక్షింతె ధ, రాజనులకుఁ గర్ణగోచరము గాకుండన్ 107

క. నానావిధరణవిజయము, హానిపుణు లవార్యవీర్యు లవఁ దగువారిన్
సేనాధ్యక్షులఁ జేసితె, నీవవిశ్రమవారి మాననీయుల హితులన్. 108

క. చోరభయవర్జితముగా, ధారుణిఁ బాలింతె యధికధనలోభమునం
జోరుల రక్షింపరుగా, వారలచే ధనముఁ గొని భవద్భృత్యవరుల్. 109

క. ధరణీనాథ! భవద్భుజ, పరిపాలిత లైనసస్యఁ బరిపూర్ణము లై
కర మొప్పుచున్నె చెఱువులు, ధరణి కనాగ్రహభయంబు దనుకక యుండన్ 110

క. పంగుల మూకాంధుల విక, లాంగుల మఱి బాంధవుల దయం బ్రోచితె భయా
ర్తుం గడిఁదిశత్రు లైనను, సంగరభంగమునఁ గాచితె శరణం బనినన్. 111

క. కృత మెఱిఁగి కర్త నుత్తమ, మతుల సభల సన్నుతించి మఱవక తగ స
త్కృతి సేయుచె కృత మెఱుఁగెడు, పతిగాను జగజ్జనుల నెల్లఁ బరిపాలింపన్. 112

క. పరకీలమున బాహ్యాభ్యం, తరజనములవలన సంతతము నిజరక్షా
పరుఁడ వయి పరమభీకుల, చరిత్రము వీక్షింతె నిపుణచరనేత్రములన్. 113

క. తెలియఁగ విద్వజ్జనము, ఖ్యులతోడ నశేషధర్మకుశలుఁడ వయి ము
ఖ్యుల లోకవ్యవహార, మ్ములు దయఁ బరికింతె నిత్యమును సమబుద్ధిన్. 114

చ. బహుధనధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీరసం
గ్రహము నిరంతరాంతరుదకంబులు ఘాసరసేంధనౌఘసం
గ్రహము ననేకయంత్రములుఁ గల్గి యసాధ్యము లై ద్విషద్భయా
వహము లనంగ నొప్పునె భవత్పరరక్ష్యము లైనదుర్గముల్. 115

చ. వదలక బుద్ధి నంతరరివర్గము నోర్చి జితేంద్రియుండ వై
మొదలను దేశకాలబలముల్ మఱి సైన్యబలంబుఁ గల్గి భూ
విదితబలుండ వై యహితవీరుల నోర్వఁగ నుత్సహింతె దు
ర్మదమలినాంధచిత్తులఁ బ్రమత్తుల నింద్రియనిర్జితాత్ములన్. 116

తే. శ్రుతినీతికిఁ గ్రమములుగావు సూనె, నిష్కృతియును జూదమును ధర్మనిత్యు లైన
వారి కీరెండును వర్జింపవలయు నెందు, బాపస్తంబు జూదంబు పార్థివులకు. 117

ఆ. కుటిలమార్గ లయినక్షత్రియకితవుల, తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁ జేసి యర్థధర్మవిసర్జను, లగుదు రెట్టివారు జగములోన. 118

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మశీలుఁ, డగుట యుత్తమము పురుషున కట్టివాని
వెలయ నర్థకామంబులు విడుచుఁ జాల్రి, విగతసుఖదుఃఖములు రెండు విడుమనట్లు 119

క. అరివరుల నోర్చి సాగర, పరిష్కృతభూచక్రి మెల్లఁ బాలింపు ప్రజా
పరిపాలనంబుకంటెను, ధరణీశ! విశేష మొండు ధర్మము గలదే. 120

చ. అలఘుగుణాఢ్యులం దధిపుఁ డైనమహాత్ముఁడు రాగకోపమ్మా
యలఁ బడి యక్షమావిభుఁ డై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి సత్యము ధర్మముఁ దప్పె సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁడయి సన్నిధి నుండ నేర్చునే. 121

క. వగవంగ సాంగోపాంగము, లగునాలుగువేదములయు నధ్యయనము పా
ల్పొగ నొక సత్యముతో నెన, యగునే యొవ్వారయిన్ను బోల్పవఁట సత్యంబున్. 122

తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁ డైన, రాజశాసనమునఁ జేసి రమణతోడ
నోలిఁ దమకమమర్యాద లోకుపడుఁ, దప్ప నోడుదు రిమ్మహితలము నందు. 123

క. కడుకొని కడుముఖులు లై, నెడ నుచితమె యాత్మనింద యొరుల్స్తుతుల ఘనం
బడలక యేకాకృతి నై, వృషము నుండుట సూనె పురుషపురుషార్థ మిలన్ 124

క. ఈలోకమ యగుఁ గొందఱ, కాలోకము కొందఱకు నిహంబును బరముల్
నే లగు గొందఱ కధిపా, యేలోకము లేదు వినవె యిలఁ గొందఱకున్. 125

చ. ధనములు సాలఁ గల్గి సతతంబును నింద్రియపాంథ గల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతను బోక లోభమో
హనిరతబుద్ధు లై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర రిప్పటిసుఖంబులు నే లయి తోఁచు వారికిన్. 126

క. అరులు మిగులఁ గొని రాజులు, నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనము జేయఁ గలరు కలికాలమునన్. 127

సీ. సత్యంబు నరులకు సంక్షీణ మగు, సత్యహాని నాయువు గడు నడఁగి పోవు
నాయువు దఱఁగిన నల్పంబు లగు విద్య, లల్పవిద్యుల విమోహంబు మిగులు
మోహంబువలనఁ బై ముసురు లోభంబు, లోభావేశమునఁ గామ మగ్గలించుఁ
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు, క్రోధంబున వైర మెంతయును బెరుఁగు
వైరమున నశేషవర్ణులు నన్యోన్య, పీడ సేయుదురు విభిన్నబుద్ధి
నొక్కఁ డొకని మీర నుండక వర్ణసం, కరము సేయఁ గలరు కలియుగమున. 128

క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁ గలరు బ్రాహ్మణులు జనా
ధిప! శూద్రులు విపులతపః, కృశితులు గాఁ గలరు వినవె కలికాలమునన్. 129

క. రసగంధద్రవ్యంబులు, రస చెడు సస్యంబు లల్పఫలము లగు మహిం
బసిపాఁడి దఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును గరము గొంచెంబు లగున్. 130

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరు లై సాధుల దోఁచి చేకొను తదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం బై యెల్ల చెల్లం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్. 131

క. క్రమమున రాష్ట్రములును నగ, రములును నాశంబు నొందు రక్షాచ్యుతు లై
భ్రమియింతురు జను లలిమ, గ్గమగిరిసరిదంతికములఁ గడు నాతురు లై. 132

క. హేతుప్రత్యయవాదన, చేతను లై వేదనింద సేయుదురు మఖ
వ్రాతంబులు వ్రతములుఁ జెడఁ, బాతురు దుర్మార్గకర్మపరు లై విప్రుల్. 133

క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజాతుల్
ధృతి సెడి తత్సేవకు లై, యతినిందితకర్మకారు లయ్యెద రధిపా. 134

(భారతము.)

సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు ధరణీశ కలియుగాంతమున వినవె
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబునఁ బ్రజ లుద్భవింతురు భామినులకు
ద్రవ్యవిహీను లై దాత యొక్కఁడు లేక యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై చెదరి పాపంబు నేసెదరు చూవె
యన్నవిక్రియ మొనరింతు రఖిలజనులు, వేదవిక్రియు లగుదురు విప్రవరులు
పణ్యా (......) యగుదురు పద్మముఖులు, కష్టతర మైనయక్కలికాలవేళ. 135

మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలము లై యరాజకము లై నిర్మూలధర్మంబు లై
ద్రవిడాభీరతురుష్కబర్బరపులిందవ్యాప్తిదుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ తద్యుగాంతంబునన్. 136

క. క్షత్త్రియజాతులు శూద్రిప । రిత్త్రింబున శౌర్యమును సిరియుఁ దేజంబున్,
మైత్త్రియును లేక చెడరి ధ । రిత్త్రిస్వర శూద్రు లై చరించెద రెందున్. 137

క. ఊఱ వగు నారుగపంటలు। గొఱియలపాఁడియును దఱి చర్మం బురుషులకున్
దొఱసలు నుట్టము లగ్యోద। రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్ 138

క. నడపవు దేవపితృక్రియ। లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్
గడఁగును మోహాతమంబులు। పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ఠ మగున్ 139

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు। గురుఁడును శిష్యునెడ వంచకుండగు మది నొం
డొరువులనొల్లరుబంధులు। పొరిఁబొరిఁగఱపులగుఁబ్రజకుఁబొడమునుభయముల్ 140

తే. క్రోధమోహానామకు లైనఘోరశత్రు। లిరువు రెరియించుచుండుదు రెపుడు విరుని
నంతరంగ మయ్యుభయంబు నడపకున్నఁ। గలదెయూరకబ్రాహ్మణగౌరవంబు 141

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడు బల్కు హింసావిమూఱుఁడు గురుజనహితార్థి
యింద్రియంబుల నోర్చి యెల్లవారఁదనయట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు
కామంబు దగులండు కర్మంబు లాఱును సముచితసంప్రయోజ్యత నొనర్చు
నట్టిపుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁ డని యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు
లార్జనంబు శమము నధ్యయనంబును, బరమధనము సున్వె బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగుసాధనంబులు, వేదవిదితముఖ్యవిధులు నవియ 142

చ. అరయఁగ జీవితంబు గడునస్థిర మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు రోయక ధర్మపరం బగు మైత్రి భజించి సత్కృపా
నిరతుఁడు నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమశమాస్పదుండు నగుబ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్. 143

క. నిత్యముఁ గర్మయుఁ గర్మఫ లత్యాగియు నగుట లేస్న లౌల్యవియోగం
బత్యంతమయోగము దత్ప్రత్యయలబ్ధుండు నూవె బ్రాహ్మణుఁడుమహీన్ 144

ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును శూద్రుకంటె నీచతముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుఁ డయ్యు నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు. 145

చ. నిజగుణదోషకర్మముల నెట్టిన మేలును గీడు వచ్చుఁ ద
త్ప్రజనిత సౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో
రుజలను దేహజంబు లగురోగములున్ హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్. 146

క. ప్రియములు వాడుటయును న|ప్రియములు వినఁ బొందుటయును బెల్లుగ నగువ
క్రియలందు మాఘమతికి హృదయతాపము వాయ దెప్పుడు దరికొనుచుండున్ 147

తే. వగతు మన్న నెవ్వారికి వగవఁ జనదు| చిత్తమున నేమిటికి సంతసింపరాదు
కాన గతమునందును ననాగతమునందు| వగవ రార్యులు సంతోషవంతులగుచు 148

క. వగపునఁ దేజోహీనుం డగు నాత్మహితక్రియలకు నశక్తుఁ డగు న
వ్వగపు దొఱఁగి యుద్యోగము| దగఁ జేయఁగఁ గలుగు నంచితములగు శుభములన్ 149

తే. లోకములు లోకధర్మములు నృపాల| రాజమూలముల్ రాజవిరహితమైన
పుడమిజనులకు నింకినమడువులోని| జలచరంబుల వడుపొల్లు సంభవిల్లు.

ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు| కోయునట్లు రాజు కొనఁగవలయు
నవ్వనంబు నతికి యంగారములు సేయు| భంగి యైన భూమి పాడుకాదె. 151

క. నమ్మమి మృత్యువు పెద్దయు| నమ్ముట యాపన్మృత్యు వగుట నరపతి నమ్మీ
నమ్మక పని గొనునది ని| త్యమ్మును నూత్మమతిఁ దాన యరయగవలయున్. 152

క. మృదుమధురవాక్యముల నిం| పొదవెడు చిఱునవ్వులోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు| నొదవింపఁగ వలయు నదిమహోన్నతి జేయున్. 153

—భారతము—

క. శరణంబని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరులకెఱిం గిది । యిరవుగ సరి గావు దీని కేధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ డగు । జనుఁ డుజ్జ్వల మైనసిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక। చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్ 155

తే. ఓటికితనము నేమఱుటయు మఱుపతనము । మెత్తబాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును। గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను వదల విడిచి మహితసమాధి
క్రమడశ నుండె నివాత । స్తిమితం బై వెలుఁగు చున్నదీపమపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము। సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును స్వర్గగతికారణముల్. 158

శా. అన్యాయార్జిత మైనవిత్తమునఁ జేయం బూనుదానంబు మూ
ర్ఖన్యాయం బది దాసఁ జేసి ఫలపాకం బేమియున్ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 159

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు । దుర్గభుఃఖ సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్థ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బె ల్లగుసౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వధని యనఁ। బరఁగుఁ జావ్వె యట్టి భవ్యుఁ డనఘ.161

క. మన్నన కుబ్బక యవమతి । దన్నొందిన స్రుక్కఁ బడక ధరణీశుకడకా
ము న్నున్నయట్ల మెలఁగిన। యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్.162

ఆ. యోగ్యతృష్ణఁ దగిలి యుచితంబు గొలఁది మై । నడచునట్టివారు పేడీపములకు
నంత నొత్తు రెట్లు సంతాపకారుల । కాక పెనఁకునలు సుఖంబు లగును. 163

క. బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, మ్రి
చ్చిల వేమవాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, మచ్చును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. గోడపడి యనుమున్నీటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడదు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేటె కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి। పువ్వుఁ దేనియఁ గ్రోలెడుపోల్కి నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము। బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. 168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బాపిణవా । నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పాలుట బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడలుల కెవ్వ డెవ్విధము వాటిలునో. 170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నదుమ నొకంటన్
వెర నెడలి తప్పినను ద । త్ఫలితఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారఁపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి యైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును నైన ముండెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
సవినయవృత్తిమై వలవ డాయుధ మార్చుటఁ దాఁకి పడ్డ నై
దువు పడిశం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాను వధింపఁగ శాస్త్రవిత్తులన్. 174

క. పురుషుఁడు పెడు ననువాఁడును। బురుషుఁడు సెఱుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు యవివేకుల య। ప్పురుషుఁడు సెఱుపండు సెడఁడు భుజవీర్యనిధీ 175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున బలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాపిన విగలివి। భూతిం గడకొలివులట్లు పొగయుదు రధిపా. 176

క. శరణంబని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరులకెల్లం గిది । యిరవుగ సరి గావు దీని కేధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ డగు । జనుఁ డుజ్జ్వల మైనసిరియు సద్విద్యయుఁ గ
గ్గిన నందు మెలఁగ నేరక। చెనఁటితెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్ 155

తే. పిఱికితనము నేమఱుపాటు మఱుపతనము । మెత్తబాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియును విషయంబులఁ గూరుటయును। గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను సదల విడిచి మహితసమాధి
క్రమదశ నుండెడి నివాత । స్తిమితం బై వెలుఁగు చున్నదీపమపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము। సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును స్వర్గగతికారణముల్. 158

శా. అన్యాయార్జిత మైనవిత్తమునఁ జేయం బూనుదానంబు మూ
ర్ఖన్యాయం బది దానఁ జేసి ఫలపాకం బెన్నియున్ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాత్రస్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 153

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు । దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్థ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగుసౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వజ్ఞని యనఁ। బరఁగుఁ జూవె యట్టి భవ్యుఁ డనఘ.161

క. మన్నన కుబ్బక యవమతి । ద న్నొందిన నీర్క్యఁ బడక ధరణీశుకడన్
ము న్నున్నయట్లు మెలఁగిన। యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్.162

ఆ. యోగ్యతృష్ణఁ దగిలి యుచితంబు గోలఁది మై । నడచునట్టివారు బెడిదములకు
నంత నొత్తు రట్లు సంతాపకారుల । కాక వెనఁకువలు సుఖంబు లగునె. 163

క. బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, ము
చ్చిల వేచువాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, నుబ్బును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. నడపడి యనుమున్నిటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నొడఁగూడు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేటె కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ బెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి। పువ్వుఁ దేనియఁగోరి లేదుపోల్కి నెదురు
గందకుండఁగఁగొనునదికార్యఫలము। బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁ జనదు. 168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బ్రాణహా । నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పాలుట బల్లిదు । లనద చేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడలుల కెప్పు డెవ్విధము వాటిలునో. 170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకంటన్
నెర వెడలి తప్పినను ద । త్ఫలితఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారఁపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి యైనయవస్థ దక్షు లె '
వ్వార లుపేక్ష సేసి రది వారలచే లగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును గైవ ముండెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁ గాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయుచుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
నవినయవృత్తిమై వలన దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు పడినం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాదు వధింపఁగ శాస్త్రశత్రునిన్. 174

క. పురుషుఁడు సెడు ననువాఁడును। బురుషుఁడు వెలుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల యా। ప్పురుషుఁడు నెలువండు సెడఁడు భుజవీర్యనిధీ 175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున వెలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాసిన విగతవి। భూతిం గడకొలవులట్లు పొగయుదు రధిపా. 176

క. తేరు శరీరము, దానికి। సారథి సత్త్వంబు, తురగచయ మింద్రియముల్,
గారుణికరబుద్ధివ్యా। పారంబులు దనరు జనుపసర్గము లధిపా. 189

క. కలిమియ చుట్టలఁ జేర్చుం। గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
ద్వాలుఁ దనిపించుం గలిమియ। పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. 190

క. కేవలనిష్కామ్రతి మో। హావహ మగు సేని గిరులు నఃపీజములున్
భూవర! ముక్తిం బడయం। గా నలదే యడవి నునికి కైవల్యపదం. 191

చ. వినుము తిమోమయం బయినవిశ్వముఁ దా వెలిగించు పిశ్వసుం
పన నొకరుండు సద్గతి నాశ్రమకోటిని వాఁడు గాడ చే
సె నిఖిలకర్మయోగవిశేషతి గల్గుటయుం డదియక
ల్పనమ శిదాజ్ఞకుం దొలఁగఁ బాడితొ లోకము గాఁగణంబుగన్. 192

క. రత్న ప్రజ గోరు నిజయో। గక్షేమార్థముగ జనసుఖస్థితి నడపన్
దక్షుఁ డగుం జా సనప కు। పేక్షించిన బాప మొందదే కురుముఖ్యా. 193

క. నరరూపంబునఁ బరఁగెడు। పరదేవత గాక నృపుఁడు బాలుఁ డయిన న
ప్పురుషునెడ నేమి పొ మ్మని। తిరిగినదుర్మతులఁ బొందదే కీడధిపా. 194

క. పండార్హు లైనవారల। దండింపక యున్నఁ జాప్వే దాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్రి। చండపుగిల్బిషము వొందు జగతీనాథా. 195

క. పేదలకును సాధులకును। వేదములకుఁ దాపసులకు వేమేల సమ
స్తాదిత్యులకును దండము। కాద బ్రదుకుఁ జేయు రాజు గావింపంగన్. 196

ఆ. ఉచితదండవృత్తి నుర్విప్రజాభిర। క్షణము నోపి చేఁత గాక రాజ
వంశజానకు ధర్మవా భూనురగ్యంబు। లైనశమపమాదు లాస్న నిడుట. 197

తే. కామభోగముల్ మే లనగాదు వాని। విడిచి చూడుము పొందదు విఫ్రలసుఖము
కాయ లాకులు నీళ్ళును గాలి యనుభ। వించియున్నమునీంద్రులు వెఱ్ఱివారె. 198

క. దుష్కృతు లామిషగత మగు। కర్మము వాటించి బంధ కలితు లగుదు ర
య్యాత్మ గడచి సువిచారులు। నిర్మమతను ముక్తి వడయ నేర్తురు వత్సా. 199

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థము లారఁగఁ గోరి తత్త్వసం
వేదనుధారసంబునఁ జవిం జిరసౌఖ్యముఁ బొంద నేర కి
మ్మేదిని నెందునుం దిరిగి మే లని కర్మము యాఁది చెప్పుచుం
గా దవి శాంతి యొప్పనిది గాఁ జెప నాడుదు గల్పబోధనుల్. 200

క. విమలజ్ఞానముఁ దపమును। దమమును త్యాగంబు శాశ్వతప్రియరాసం
దమునకు మూలము లందురి ని। జముగాఁ గైకొం డ్రివియ ప్రసన్నవివేకుల్ 201

ఈ. కామముఁ గ్రోధమున్ మనను గాఁడఁగఁ బాఱుట మాన్చి యింద్రియ
స్తోమవిమార్గవర్తనము ద్రుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి యించుక నొంపక లోక మేలఁగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు (నిచ్చలున్.) 202

ఆ. న్యాయశాస్త్రవేది యై యింగితాకార। చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట
తావిశేష మరసి దండనీతి యొనర్చు। పతికి నెల్లమేలు నడయ వచ్చు. 203

క. అరి యాఱవపా ల్గొనుచుం। గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట। పరమపదముఁ జేర్చు (నొడుచు) భయసంశయముల్ 204

చ. క్రమమున నెట్టిశాత్రవులఁ గ్రిందున నైనను జూడఁ జేఁత ధ
ర్మము విను పాపకర్ము లగురాజులతోఁ దగ సంధి సేఁత దో
షము విభుఁ దుర్వి యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ గూడునే
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండుధర్మముల్. 205

తే. కల్లు ద్రావుట గురుపత్ని గవయుటయును। విప్రుఁ జంపుట బ్రహ్మస్వాపహరణమైన
ముచ్చిలుటయు నునివి గలకూర్మిజనులఁ। బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు.

క. వినుఁడీ సుఖమును దుఃఖము। ననిత్యములు గాన హాని యాగమకాలం
బున ముదమును శోకము మొగ। కొనమియ చమ్మఅవు శాంతి గోరుజనులకున్

తే. మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమవి। వేకు లగువారు సుఖు లట్లు గాక కొంత
ప్రజ్ఞ గలవార లై యవపప్రతిభు లైన। జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు. 208

తే. పాదలుఁ దలఁగుటకై పాడ వెదుగుఁబడుట। కైకడుం జేయఁ బాయుటకై జనించు
బొలియుటకునై సుఖంబులఁ బొందుమశిఖ। మొందుటసనై పదార్థము లెందునధిప.

చ. పల నధికంబుగాఁ గలుగువైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడఁగూర్చ నేర్చి తనుదోషము లారయుబుద్ధి గల్గి యా
ర్తులకుఁ జికిత్స సేయుదురు రోగము వాయమి లేద వారు రో
గు లగుట గాన మెల్లు ప్రతికూలవిధిన్ నరు నేర్పు ద్రోచునే. 210

క. జననజరామరణగ్రా। హనిబిడకాలాబ్ధిమగ్న మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన నము। నుండుం జింత పక్కి భూపవరేణ్యా. 211

క. తనయొడ లెరవనినను మను। జానకును బంధుతతి సతమె శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె। మ్మన మధికము నొచ్చుఁ గాక మహితవిచారా. 212

తే. మాతృపితృదారపుత్రిక భ్రాతృశతస। హస్రకంబులు సంసృతి ననుభవింపఁ
బడియె నం దెవ్వరికినెయ్యడలువాఁడు। నరుఁ డనిత్యత యూహించు టగయ నుఱవు.

క. నరవర సరసాన్నంబులుఁ। బరిమళసద్వస్తువులును బరమశయనవి
ష్టరములుఁ గాలాధీనా। నరుఁ బొందుం బాయు వాని నమ్మమియ యుఱున్. 214

మ. మనుజాలు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెన్నెడుక్
వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మెం
దు నొకో కుఠారముక్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం
డనియెడినిశ్చయంబు దృఢమై మది నిల్పినఁ జాలు భూవరా. 215

క. దురమునఁ గైదువుఁ గొని తను। బొరిగొన నేతెంచునట్టిపురుషుని వేదాం
తరహస్యవేది నల్గునను। బొరిగొనినం బాతకంబు పొందదు వత్సా. 216

తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి। కాని గృహమేధులకు భోజ్య మైనఁ గుడువఁ
దగదు యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ। నార్యజనములు నెన్నరు రధిపవర్య. 217

క. ఆలును బిడ్డలు బంధులు। నై లీలఁ జరించుచును గృహస్థుఁడు పర్త
ల్లోలత్వాగ్రహితచిత్తత। మేలుగ నలవఱుప వలయు మీఁ దెఱిఁగి నృపా. 218

తే. పందునకు బిడ్డ నిచ్చినచంద మొందు। బూదిలో నేయి వేల్చిన పోల్కి నోటి
కవపలో నీళ్ళు నట్టినకరణి యగు న। పాత్రజనులకుఁ బెట్టుట పారవేంద్ర. 219

క. శిల చేసమ్రింప నెప్పుగ। జలనిధిఁ గడవ దొరఁకొనినచా డ్పునఁ బాత్రం
బులు గానికొలఁదల దానం। బులఁ బాపము నిస్తరింప బుద్ధిఁ దలంచినక్. 220

ఆ. పుసకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ। ళ్లధికనిందఁ బొరయునట్లు దుష్ట
మై యపాత్రవిషయ మగునీగి నృథవోవు। నిచ్చువోటఁ బాత్రి మెఱుగవలయు 221

ఉ. రాజటె రాగహీనుఁ డటె రాజితసుందరమూర్తి యట్టె వి
భ్రాజితసంపదున్నతివిభాసితుఁ డట్టె కామినీ
రాజిమనోజ్ఞభంగిచతురస్వధనుం డటె బ్రహ్మవాదీ
తా జితమన్మథుండు నటె జన్మము ఇట్టివి యెందుఁ గల్గనే. 222

క. తరణి పొడిచి తమము నెఱచు। కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్
ధరణిపతి ధర్మమార్గ। స్ఫురణంబునఁ జెఱుచు విమలబోధచరిత్రా. 223

క. దాంతియుఁ బ్రియవాదిత్వముఁ। శాంతియు శీలంబుఁ గలుగుజగదీశుఁడు శ్రీ
మంతుండు యశస్వియు నై। యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా. 224

తే. ప్రకృతు లేడింటఁ దగ సడపంగవలయు। దాని కార్యసత్వముల్ దావలములు
దండనీతివిధాన మంతటికి రక్ష। యర్థ మగు మెల్పుతోఁ జేయ నది నెలుంగు. 225

క. గురుతల్పగు భూగ్రహునిన్। నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ జెలుచన్
ధరణి వెడల నడువవలయు। శరీరనిగ్రహము సేయఁ జనదెయ్యెడలన్. 226

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందుభూ
వరునాజ్ఞం జన కీగి మెచ్చరు పనిన్ వంచింతు రగ్గాడిఁ జో
త్తురు కౌతూహలవేషభాషణములం దుల్యత్వముం బొంది యే
తురు వారెల్లపదంబుఁ గోరుదురు గొందుర్ భూమి మాటొడ్డులన్. 227

క. అనలేపంబునఁ గర్త। వ్యావివేకము లేక పలసినట్టాల యొవ్వారి
డపనీతి సేయు ధరణీ। ధవుఁడు విడువవలయుఁ దన కతఁడు గురుఁ డైనన్ 228

క. పొనరిచి యాడెడుమాటలఁ। గొనఁ దలఁపక దుర్వినీతకోటిధనంబుల్
పెస కెక్కి సత్కృతప్పులఁ। గొని సుజనుల కీగి నృపతి గుణ మందుఁ బుధుల్. 229

క. ధన మపహరించుటయు। తన కనిశముఁ బనిగాఁగ బ్రదుకు నటిలుబ్ధునకున్
వినుఁ శత్రులచే నాటకు। మును దనప్రజచేతఁ జేటు మూఁడు నరేంద్రా. 230

ఆ. ధర్మరతులు నర్థనిర్మాణచతురులు। లౌల్యరహితులును నలంఘితాజ్ఞు
లునై సునీతినిపుణులును గులజులు నగు। పరిజనములఁ బెనుపుపతికి హితము. 231

ఉ. కానిపథంబునం జనక కారుణికత్వము గల్గి శాంతిమైఁ
దా నడపంగ విప్రవ కుదాత్తధనం బొసఁగూడ నేని సం
తానము పూర్వ కర్తలకు ధర్మనిరూఢతఁ బంచి పెట్టి దు
ర్మానవిదూరుఁ డై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా. 232

చ. యజనము దానకర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలనసేఁతయు సంగరంబునన్
విజితవిభీతి మై నురవణించుటయున్ నృపధర్మముల్ గురు
ద్విజతిలకాయమాన సమవర్తి సుధర్మువు వీనిలోపలన్. 233

మ. గురుశుశ్రూషయు నాగమాధ్యయనముల్ గోష్ఠీనిరాసంబుఁ ద
త్పరతం బొం దొరయంగఁ దాఁ జొరమియుక్ భైక్షాశనత్వంబు వ
ద్వారకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక యీ
ష్వారితోషం బగ గాక యున్కియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్, 234

శా. తానుక్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁ డైనం జనున్
మానాహంకృతు లూడ్చు నింద్రియములక్ మర్దించు నచ్చో జడల్
పూనుం దాపసశాస్త్రముల్ సమువు ల్పున్ గోష్ఠి తజ్జ్ఞాళితో
వానప్రస్థవిధాప్రవిష్టుఁడు ప్రియా వాత్సల్యనిష్ఠాత్ముకా. 235

శా. ఎచ్చో నైనను నిల్చు నాతలికి నేమేనిం గొనుక్ రాత్రి నై
నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ దా
నిచ్చం గోరఁ డొకండు నింద్రియజయం బేపారుభోగంబులక్
మెచ్చక్ మొక్కునుఁ దొల్గు కుండు యతి పేర్మిన్ నిర్మలుం డై నృపా. 236

క. తరణిశశాంకుల తేజ। స్స్ఫురణము లేకున్న యట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జెడ్డుదురు। నరపాలక హితపాలనము లేకున్నక్. 237

క. రాజనకుఁ బ్రజ శరీరము। రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయుక్
రాజోత్తము యన్యోన్యవ్వవి। రాజితు లై యుండ వలయు రక్షార్చనలక్. 238

క. తనుఁ దాన తొలుత గెలువన్। మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్
మనమునఁ దలంచునది మును। దను గెలువనిపతికి గెలువఁ దరమే పగఱన్ 239

క. ఆరామాదికనిజసం। చారస్థలములకు దేశసంఘలకుఁ బురీ
ద్వారములకు నగరికని ధ। రారమణుఁ డొనర్పవలయు రక్షలు నియతిన్. 240

తే. అర్థులకడ నిజభూమియం దనుజతనుజ। బాంధవామాత్యమిత్రుల పాల వేన
ధనుల వేగులఁ గాఁ బెట్ట ధరణిప్రభుకుఁ। వలయు నొండొరు లెఱుఁగని కారు గాఁగ

ఆ. కయ్యమునకు వలదు కాల్దిర్వ నధిప సా। మమున భేదమున నుమార్తుమనము
మెత్తఁ జేసి చెతిచి మేవడిఁ దప్పించు। కొను తెలం గెతింగికొనుట మేలు 242

చ. జనకుఁడుఁబోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు వష్ఠభాగముం
గొనునది వారిచేత నరిఁ గోటివిధంబుల నాస్తదతులం
గని వనగోకులాకిరనగప్రముఖార్థకరంబు లారయం
బనుచుచు నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నడిచియున్నఁ బెం పగున్ 243

తే. తనకు మేలొనరించు నాతండు మిత్త్రుఁ డతఁడు నడపంగ నెల్లకార్యములు శుభము
నొందు నేమిట నేమఱకునికితోడ। నృపుడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుపవలయు.

క. బలఁగము గలభూపాలుఁడు। గెలనిమహీశ్వరులబుద్ధికిని వేఁగకుచున్
బలియుఁడు తను లేనివానిం। జాలక నగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. 253

క. ఎక్కువతక్కువమాటలు। నుక్కువములు నెందుఁ గీడు నొందించుటయుం
జెక్కు దనయన్నదమ్ములు। దిక్కున నన్నియును సైఁపఁ దేజము సేయున్. 254

క. లోపల రాఁజుచుఁ బొగయుచుఁ। బాపంబులు దలఁతు రోపి బలిమియు వెఱపుం
జూపక తక్కువ కెలనికి। నేపాటను వారి నడపు టెంతయు నొప్పున్. 255

క. మృదుమధురవాక్యముల నిం। పొదవెడుచిఱునవ్వుతోడ సుగ్రీవుఁడు స
మ్మదమును సచివులకుఁ బ్రజలకు। నొదవింపఁగ వలయు నది మహోన్నతిఁ జేయున్

క. నలికుట యర్థముఁ గొనుటయుఁ। జెఱ నునుచుట కట్టి యడిచి చేడ్పాటొందం
బఱచుట మొదలుగఁ గలపలు। దెఱఁగులఁ దగు మెయిని నడపు ధీరవిచారా. 257

క. తనకతమున వచ్చి మొగి మో। దనివాఁ తనుమాత్ర వల్కుటకుఁ గోపింపం
జనదు జననాథునకు దూ। తువిఁ జంపిన నరకి మగుట ధ్రువమని రాయ్యల్.258

తే. కులము శీలంబు హితవాక్యములును నేర్పుఁ। గావ్యవాదిత్వసద్వచోగౌరవంబుఁ
దలఁపు గలుగుట దక్షత యలఘుగుణము। లందుఁ బ్రమాత్రకు నియోగ్యుడు నార్యజనులు.

క. మొన దీర్చువెరవు యంత్రము। లనేకము లొనర్చు నేర్పు నాయుధముల వి
న్నను వును బోటులక్ష్యం। బును సేనాపతికి నైజములు గా వలయున్. 260

క. తనయుల నైనను నమ్మకు। జనపతి సిరి గోలుపోవుఁ జతురత మైన
మిత్త్రవాఁడపోలె నమ్మక। యునికి సకలజనులయెడల నుగ నై యుండున్. 261

క. చోరులచేఁ జెడ కుండం। గ్రూరులచేఁ జావ కుండఁ గువలయజనులన్
జారులచేఁ బడ కుండ ధ। రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 262

క. అవ్వ దేహమునఁ గృషి యున్। సవరణలును బనులసొంపు సరి యట్లగుటన్.
భువి బలుసు గలుగుకాఁపుల। నవనీశుఁడు గన్న ప్రజల యట్లరయఁ దగున్. 263

క. అరి మిగులఁ గొనుట శ్రీపురులఁ| బొరివాలఁగఁ దిగికినట్లు భూవర కదుపున్
వెరవునఁ జేనిచినయట్లగు| నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 264

క. విను కర్షకులును వణిజులు| వనఘా గోరక్షకులు ధరాధీశునకున్
ధన మొసఁగఁగా డెడువోటులు| కనేకవిధములకు నెల్ల నావ్యస్థలముల్. 265

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తిస్థలము| లయినవాని కించుకయును హాని గాక
యుండఁ దనకును బండారమొదవఁ దగును|పాలనము సేయ వలయు భూపాలకుండు

క. పులి గూనలఁ దినుచందము| గలిగిన సంతతిన నిలుచుఁ గాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున| జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. 267

క. అరయుటఁ బ్రజ వర్ధిల్లఁగ| నరి యేఁటేఁటఁ గ్రమవృద్ధి యగునట్టులుగా
నరపతికిఁ గొనఁగ వచ్చు| స్వైరవృత్తిఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. 268

క. దమియింపఁ దగినవారల| సమయమున దమించి వారి సంపదలు మహీ
రమణుండు దనదుబండా| రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. 269

క. ఆపనికిఁ గీడు తోఁచియుఁ| భూపాలుఁడు ధనము గలుగుపురుషులసిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు ద| యాపరుఁడై పెంప వలయు నఖిలజనములన్. 270

క. ఆయతి కిమ్మైయిఁ గలుగును| పాయంబులు ధర్మమార్గఫలితంబులుగాఁ
జేయుటయ మేలు నృపతికి| మాయాకృతినిప్పుడుఁ దగుట మతి గాదు సుమీ. 271

తే. భూతసృష్టులు ఘనలాభములును గలుగు| ధర్మమునను రా జనువాఁడు ధర్మరక్ష
కై జనించెను గావున నతఁ డెగోప| కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు 272

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగ న
ద్ధరకున్ విఘ్నము లేక యుండుఁ బ్రజకున్ దైన్యంబు వాటిల్లుఁ జె
క్కురుజల్ పైకొను నెందునుం గలయ నుక్కుం దేజముం దక్కు న
ద్ధరసైన్యంబుల శస్త్రలోష్టములు బంధుశ్రేణికిం జేటగున్. 273

క. కాని చెయిదములు సేయక| మానధర్మమునను నహిమమూర్యేశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును| దానును సేనలును శుభము దలకొనఁ జేర్చున్ 274

ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ। సిద్ధి దాన సకలసిద్ధులును బ్రి
శస్తభంగిఁ జేయు శాశ్వతకీర్తియు। సంభవించుఁ గలుగు సద్గతియును. 275

క. ధనమున్నదె ధర్మము దెస। ననాదరము సేసె నేని నానృపతికి న
ధనమును జెడు దుర్యశముం। బనుగొను మరి దుర్గతియును వాటిలు ననఘా. 276

క. ధర్మపరిస్ఫూర్తి యయ్యును। ధర్మము నా కింతకంటెఁ దత్తద్వ్యాధులం
జేర్చిం బోరయ వలయు నను। ధార్మికతానుష్ఠ నత్యుదాత్తుఁడు వొందున్. 277

క. మూలబలము సంతుష్టం। బై యొకకి మరచు మన్నయప్పు డసమునో
టాలోకించి నచెన భూ। పాలసునకు నంపె మతిశుభం బొనరించున్. 278

చ. సమరము సాహసం బధికసంపద లమ్మియుఁ దెచ్చికోలు ప
థ్యమె రిపు లేల కల్గురు రహంకృతి పెంపను నుత్కటంపుఁగో
పము మనిపింపఁ జాలునరపాలున కట్టిగుటక్ హితంబు సా
మము వినయాంతరంబుఁ దయమనునాసు నెఱెన్ మహేశ్వరా. 279

క. లిపనష్టులు గలఁగినప్పుడు। ధన మిచ్చి విరోధి నల్పతరు నైనను శాం
తునిఁ జేయ వలయు దానము। నన యధిపునిఁ జేయ్చు టుగ్రవు నరపతి కెప్పుడున్. 280

క. విను చిల్లి యుడినయాయుధ। మును విషలిప్త మగుశస్త్రమును నెట్టియమి
త్రునిపై నైనఁ బ్రయోగిం। చినచరపతి నరకమును జనించు నృపాలా. 281

క. శరణాగతుఁ గాచియు నవి। నరపోటులఁ ద్రోఁ దెచ్చి యారసియు ధరణీ
సురులం బోషించియు నానా। ధ్వరములు సేసియును రాజు దలఁగు దురితముల్. 282

క. చపలఁ బనిచి యాకుల తెలి। యగముమ నా రెసుర నవమనట్టి దయిన దె
ప్పర్పుంజయువున దప్పిం। బోరసినదెస విడియుగోట బోడుము టుగ నగుక్. 283

ఆ. నిరుపపోవుగోట నీరుదాపివెడుగోటఁ। గూడు దినెడుగోటఁ గోడికి సోలసి
నప్పుడుఁ జెపరి యున్నవనసరమునఁ బగ। వారిఁ బొడివి చెఱుప వలయు నధిప. 284

తే. ఏను గేనుగుఁ జేర్చిన జ్లెసక మోసఁగు। సంగములపెంపుఁ బులికిని సింగమునకుఁ
బట్టిపట్టి మొగ్గితయుకు గట్టి మొలదము। బలను గలయోధవీరులు వలయు ననికి. 285

క. హైనికులమునను లుత్సా। హానూనను లగుచు నుండు నాయపేరంబముల్
పీనులమను సాగియుండు గ। జానీకము లుబ్బ విజయ మగు సైన్యమునక్. 286

క. క్షమ మేలగు నైన నతి। క్షమ దైన్యముఁ దెచ్చు నెదురు గర్వించినఁ గ
య్యము వొడిచి గెలిచి యరిశే। షము నెడ సదయత్వ మావిశదుఁ డగుటొప్పున్ 287

చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడు దేనియ లుట్టునట్లుగా
నరపతి వారివారలు వినం బ్రియ మాడుట మేలు, పక్షిఁ దాఁ
దిరముగఁ జేరఁ గా మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త
త్స్వరములు నూపి కాదె తుది జంపఁ దగుం దనబారిఁ బాటినన్ 288

క. కాలవిపర్యయమున నర। పాలుఁడు దా మొక్కి గైనఁ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి రాఁగన్। గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్. 289

క. అపదితనంబును బెడిదపుఁ। దనమును లే కుండఁ బరఁగి దరియొత్తైను నే
ఱునుబోలె నొత్తునాలయును। మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా 290

క. పెక్కండ్రితోడ నీరస। మెక్కటఁ జేసిన కొనక తఱిఁగి యున్నపగరతో
ను క్కారి బంధుభావముఁ। దక్కటిపగరయొక వలయుఁ దా నెఱపంగన్. 291

తే. అర్థనంతుఁ డై భోగంబు లనుభవింపు। మన్న యాప్పడ యిది యిట్టిలుండ నేర
దర్థిగము తానులోనుగా ననిమొఱుంగు। నతఁడు ఎగ బొందఁ డేని యొక్కైన నధిప. 292

క. కానియటు లుండి నెఱిఁ బడు। నైనతెఱఁగు దోఁచి మాయ మను నిర్భంగిన్
మానసమున కుబ్బ ఎగయు। దేనోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. 293

క. గతమునకును వగపక యా। గతమునకును నోవు తెఱచి కడుఁ గోరక దీ
నతఁ బొందక నైజం జే। గతి బంచిన దానఁ బోదుఁ గా కనులయున్. 294

క వోనును లావును గిరిగిన। పురుషులు లే రెల్లు లోకమున నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె యని నగఁ। బొరయఁడు ధీరుండు కలిమిపోకకు నధిపా. 295

క. ధర్మ మధర్మముభంగి న। ధర్మము ధర్మంబుమాడ్కిఁ ధరలోఁ దోఁచున్
నిర్మలమతి నరయ నలయు। ధార్మికతన కోమవాఁడు తన కేవ్వఁ బెఱగన్. 296

క. వాకురిమాటలఁ దేలక। భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస
ద్భావుని సద్భావుని నవ। నీనర యెవ్వెఱు నెఱుఁగ నేరఁగ వలయున్. 297

ఆ. అరినృపాలు పెంపు నాత్మీయశక్తియు। నెఱిఁగి మూర్ఖవృత్తి నెఱుగనడక
యుచితవృత్తి నవనియుద్ధతి మెలఁగఁడి। గడపి హీనబలుఁడు గడకె నిలుచు. 298

క. కిరణముల భంగిఁ జతురపుఁ । బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గనుగొనుచును । దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 299

చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగు కాముతం
త్రనిరతుఁ డైనవాఁడు నుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం
డన మొనరింపఁ డిట్టిపతి డాయరు సాధులు నార్యులున్ సుహృ
జ్జనములు దానఁ జేటు నగుఁ జావును బాటిలు నెల్లభంగులన్. 300

క. తనభూమిఁ బరులభూమిని । ధనము నుపార్జింప వలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం । బునకును మూల మగు ధర్మ మునకు నరేంద్రా 301

క. తనకొలఁది నుపాయంబులు । వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును నై । కొనము విరోధులును సరకు గొనరు కుమారా. 302

క. తెరువాటున మ్రుచ్చిమి ను । ద్ధురు లగుక్రూరులకు మూఁక దోరం బగు న
వ్వైరవరివారల బలంబున । ధరణీశుఁడు గూర్చుకొనుట సైన్యము దెచ్చున్. 303

క. అన్యాయంబునఁ బొసలిన । సైన్యముచే సమరజయము సమకూర దనూ
నన్యాయపరులు గాంతురు । మాన్యత్వము దస్యు లైన మనుజాధీశా. 304

ఆ. మేలు సేసి తగినమిత్రునిఁ బడసి త । త్సచ్చరితముల నచ్చుసుఖము లనుభ
వింపఁ జూమ టుడిగి వేష్టించి యుండుట । యగయ నీతివిదుల తెరవు గాదు 305

చ. అరుల నమిత్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకార్యమ
వ్వైర వతిమ్లభం బరులు వీ రన నుండియు మిత్రభావముం
బొరయుటయున్ సుహృజ్జనులపోలిక గ్రియు శత్రుభావుగా
న్మారగ మొకప్పు డూపుటయుఁ జాతము గాద ధరిత్రినాథపన్. 306

క. బలవంతుఁ డైనశత్రుని । వలనఁ బ్రజానాజనము సరిగి నలను కలిసిఁ దాఁ
గలసియు నది గడవనఁ గాఁ । దొలఁగ వలయు నవ్వ్యేనేనిఁ దుదిఁ గడొలయున్ 307

తే. నమ్మఁ దగనివారి నమ్మకయున్నది । తెగినవారి నైనఁ దద్ది నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మదునట్లు । యుండి యొరుల నమ్మకునికి నీతి 308

క. వినుము తెరి వేచి రిపు మూఁ । పున నొరఁగ వలయు సమయముం గనుగొని గ్రి
క్కున నఁ గడవ శిలాస్థలి నై । చిననాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్. 309

క. విని వినని వాఁడపోలెం, గని కానని వాఁడపోలెఁ గానలయు విభుం
డొనరింపఁ దలంచినపని, కను వగునంతకు నభేద్యుఁడై జనులరయఁడన్. 310

తే. బహుళమగు గర్వమునఁ గార్యభంగి యమున, గార్యసరణియు నెఱుఁగక కనార్యవృత్తి
గాని తెరవున నడచినయేని గురుని, నైన శాసింపఁగా దగు నండ్రు బుధులు 311

క. తెగఁ దీర్పక తెగ నార్పక, తెగటార్పక కడమకొంత దిక్కొనఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును మఱి పెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్ 312

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు, మార్దవమునఁ బరవిమర్దనంబుఁ
జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు, గాన మృదువు తలప ఖరము సువ్వె 314

క. తపము నిదానము ధర్మ, ప్రపంచమునకెల్ల దానిఁ గ్రమమున నిరతం
త్రిపరాయణు లొనరింతు రధిప ఫలమూలాంబుస్మృత్తిఁ దృప్తిఁ బొరయుచున్ 315

క. విను మశననిగ్రహము దప, మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతు చిత్తశగతిఁ, జను నఖిలస్థావరములు జంగమతత్త్వములున్. 316

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు, లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లొలయు, నఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు 317

క. సమతయు దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు సహింసాదాన, క్షమాత్యజనసూనృతములు సత్యము మూర్తుల్ 318

చ. కుసుము సమస్తధర్మములకున్ విను సత్యము యోగమోక్షస
త్పసములు సత్యకార్యములు పాప మసత్యముకంటె నొండు లే
దు పలుఁప నశ్వమేధములు తొమ్మిదినూఱులు నెండి నూఱు నై
దొదవిన నైదు గావు భరతోత్తమ సత్యముతోడ నాఁగయన్ 319

క. భూతములు జరాయుజాణో, పేతంబులు గాన మోక్ష మెదఁ గోరుట మే
లాతతనిశ్శ్రేయసం, జాతమనోమలిఖభారసహుఁ డగుకంటెన్. 320

క. మనమున ధర్మము నర్థం, బును కామముఁ గెలుకొనక పారపాచ్చెము లై
చన సుఖదుఃఖంబుల ముడి, మును ద్రెవ్వముఁ బొందవ కునికి మోక్షకరమగున్ 321

ఉ. కూర్తుఁడు లోభియున్ శఠుఁడు కొండెయుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁడున్
నేరనివాఁడు బొంకరియు నింపకు నోర్చ్పనొండు బంటయున్
ధీరత లేని దుర్నయు మతిత్యసవర్తియు నల్గువారలుం
జేసి నసిక్క భూపతికిఁ జెట్టయి యొనర్చు నశేషగోత్రమున్. 322

క. మిత్రుం డైహికములు నా। ముష్మికములు నైనభద్రములు దలకొలుపున్
మిత్రధనంబులలోనను। మిత్రుఁడ యెక్కుడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజుఁడు సుగుణా। యుక్తుఁడు సుస్నేహమతియు నగుమిత్రునకుం
జిత్త మెలర్చు తెఱంగున। బొత్తున మన వలయు శుభముఁ బొంద వలసినన్ 324

క. కదియుం గాష్ఠముఁ గాష్ఠము। నదిలో మఱి కొంతసేపునకు బాయును నె
వ్వరి నట్లుగఁ దలఁపఁగ నల। ఇదె పితృపుత్రాది బంధువర్గము నధిపా 325

క. ఇది నాయది యనుమమత। స్మృతి నెయ్యది పట్టుకొల్పెను వాసిత మై
తుది జేటు నొంది వానికి। నది లోకము నాసహించు నత్యంతంబున్ 326

క. భీరుఁడు శూరుఁడు జముఁడు వి। శారదుఁ డబలాత్మకుండు సబలుం డన లే
దేరి నయిన మృత్యువు దు। ర్వారం బై యుపహరించు వైశికపర్యా 327

క. కామక్రోధాద్యము లగు। నీమానసవికృతు లుడిపి యేకాంతగృహా
రాముఁడ వై నిను వెదకుట। నూమే లొం డెల్ల నుడుగు సులభవివేకా 328

క. ఎవ్వోట నైన నధముఁడు। విన్నవిడి నుండు లేమ వెఱ పించుకయుం
బొచ్చెంపుఁజంద మొల్లఁడు। మెచ్చరె సుగ్రైనఁ బలుకు మృదువై యుండన్ 329

క. ధనవత్త్వము దుఃఖకరం। బని కని తత్కాంక్ష విడుచునతనికి ధనితా
జనితాత్మదీనత్వం। బనుపమసౌఖ్యంబు సేయు నక్షీణముగన్ 330

క. మనమునకు సుఖముఁ గోరెదు। జనులకు నక్రియావిశాసభంగుల్
పానుపవ విడిచి భయము నే। కునికియ యూహించిచూడ నురవ్యాంగిన్ 331

తే. సామ్య గోరి యంతన సుఖముగలుగ। దని యుపాస్తింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగె నేని ననేకచింతల నొనర్పఁ। జెడుట చావుతోఁ దుల్య మయ్యెడుమ లేల? 332

క. శోకశ్రమత్వస్తలకున్। నీకలిమియు మూల మగుట నీ కగపడువాఁ
డేకత్త్వము గానం। డోకామమ నిన్ను దాటిఁగి యుండెద సుఖి నై 333

తే. ధనము చేటున విసివి నామనము నిన్ను। నీడ విడిచెను గామమ యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెంది। నాఁడ లోభాదు లొండవు నన్ను నింక. 334

తే. కామ సుఖదివ్యసుఖములకాంక్ష దొఱఁగు। మేలు షోడశాంశంబునఁ బోలలేవు
గాన కామమ నిను శత్రుకరణిఁ జంపి। బ్రహ్మపురమున నుండెద రాజువోలె 335

క. చనినఁ జను నున్న నుండును। మనుజుఁ డొకటి సేయఁ జేయు మనుజాధిప తో
డన తగిలి నీడవోలెను। విను చేసినకీడు మేలు విడువవు వానిన్ 336

క. కలవుపయిఁ గలవు వొరయుచు। వెలుపుపయిన్ వెలుపు దోఁప విడువనియఁడుమం
దొలఁగమిన్నైఁ బురుషుఁ డిడుము। దొలఁగమిఁ జేప్పడుచు నడచు దుష్కర్మములన్

ఆ. ఉత్సాహంబుమీఁద నుత్సాహ మందుచు। సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున। కరుగు నరుఁడు సత్కృతి యైన నధిప 338

క. విను గుణములు మాయకు నొడ। లని యెఱిఁగి తమోరజస్సు లడఁచి సుసత్త్వం
బున నిలిచి సద్వివేకం। బున నదియుం దోఁచి విమలబోధాత్ముఁ డగున్ 339

క. సత్యము తపమును యజ్ఞము। సత్యము వేదంబు దాంతి శాంతియు నగుటన్
సత్యము దొలఁగుట నిర్మల। నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్ 340

క. విను మానసపరిసన్నతఁ। దను గనుపురుషుండు గలుషతం గానఁడు దే
టినసీట రూపు సూపఁగ। నను వై కలక నణి లేనియట్టులపోలెన్ 341

తే. ఇంద్రియంబులు దమయిచ్చ నిట్టు నట్టు। దిరిగ నేని దుఃఖంబులఁ దెచ్చు నవియు
కట్టువడి సుఖ మొసరింపఁ గాన నాత్మఁ। గావవలయు నింద్రియచోరగణమువలన

క. జ్ఞానము గేవలకృప న। జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం
గా నది సకలధరిత్రీ। దానంబునకంటె నధికతరఫలద మగున్ 343

తే. వెలుఁగు చుండెడిదీపంబు వేఱునను। వులఁ బ్రకాశింపఁ జేయున ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియములను మాన। సమును దనప్రభ విగతజాడ్యములఁ జేయు

క. విను పురుషున కింద్రియములు। మనంబు గలిగించుఁ గ్రియల మనుజేశునకుం
దనతన తెలుఁగునఁ గార్యము। లనేకములు నూపుసచివు లట్టుల వత్సా. 345

క. నల యురి యొడవ గాలము। గలిగి కదా మృగముఁ బక్షి గజము ఝషము ద
క్షులు వట్టుదు రట్లె త। జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. 346

క. పా మెఱుఁగుఁ బాముకాళులు। ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని। ధీమలనిర్మోచనంబు తెలుఁగు నెఱిఁగినన్. 347

ఆ. అడవి సొచ్చి యంతకంపకు నఘులకు। నతికుతూహలమున నరిగి యరిగి
చూచు చుండునట్లు సూచె సంసారకా। ననమునందుఁ దిరుగు జనులనడపు. 348

క. విను తెప్ప లుడుపఁగ భేషజ। మునసుం దలకొనినచందమున మది సత్యం
బును శౌచము శమమును దమ। మును నెలకొలుపంగ వలయు మోహచ్యుతికిన్.





తే. స్మృతియుసంప్రీతియునుబ్రసన్నతయుమతియు। నిద్రుశమములగుసత్త్వగుణోదితములు
రాగలోభరోషములు రాజసములు। దర్పశోకప్రముఖములుదామసములు. 350

క. జ్ఞానాజ్ఞానంబులకుం। దాన యుపాశ్రయము బుద్ధి తత్త్వాహంకా
రానూనలక్షణాద్యం। బైనదెఱుక దాని జీవుఁ డని చెప్పు శ్రుతుల్. 351

క. జ్ఞానంబు దృష్టి నరునకు। గాన నయనహీను నుపకరణి యగుటఁ బ్రి
జ్ఞానవిహీనునివడవడి। దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. 352

క. పరిహాసము భాషణమును। నిరీక్షణము లోనుగాఁగ నింద్యంబులు నుం
దరులతోడ దీని కే మని। చోరఁ దగ దట్లైన మనను సోత్తురు సుదతుల్. 353

క. విను మాంసాస్థిమయం బని। వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు మది దగుల దా। వనికిని నాడీవిశుద్ధి ప్రాప్తగుఁ బుత్రా. 354

క. జ్ఞానము యింధనమౌగ వి। జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ జరయు మరణముల్
నానావిధదుఃఖంబులు। లేనిదియమృత మక్షరంబు లె స్సైన తోఁచుఁ. 355

క. కట్టినచీరయునుం జైఁ। బెట్టినచీరయును మాఱి బిగి యూరంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను। నెట్టన పొదివినది దేహిని గుణత్రయముల్. 356

క. వాకును మనసును గాయము। నేకాయనవృత్తి శౌచ మొసలనిలపమున్
జేకొనువది యది బోధ। శ్రీకి ఘృతంబునకు వెన్నక్రియ జనక మగుల్. 357

తే. బ్రహ్మచర్యమహింసనాఁ బరఁగుపరమ। ధర్మములు రెండు నువ్వియు త్తమతపంబు
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ। సంతుఁ డై చూడ నేర్చు సర్వంబు వనఘ

క. ప్రియములు నప్రియములునుహృ। దయమునఁ జిక్కువడఁ దిప్ప దత్తదనేక
క్రియలకుఁబోచ్చువరుఁడు మెయి। న్యాయమగు టెఱుఁగండు వెనుజ రాదివ్యసనల్. 359

క. ధనములు బంధులు భోగము। లనియెడునస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును మన। మున శాంతిశ్రీసమృద్ధి మోక్షము నిచ్చుల్. 360

తే. నరుఁడు సుఖదుఃఖములవెంటఁ బోరయ వీక। మలఁచి యాత్మను జేర్చిన మానసంబు
లీన మగు నంద జలములలోన నిడిన। లవణకణముచందంబున వసనినాథ. 361

క. సమసృష్టిని తాయితుఁ గన। కముఁ జూచుమ సత్స్వామధికలితం బగున్వృ
త్తము నడపిన శ్రద్ధబ్రి। హ్మము షణ్మాసముల యోగిమతి వర్తించున్. 362

క. అనఘ దివసంబు రాత్రిగు। ననునివి భానునకు లేనియట్టులు సతతం
బును పరమయోగయుతుఁ డగు। మునికి వివేకావివేకములు లే కుండున్. 363

క. ఒరు లేమేని నొనర్చిన। నరవర యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయ కునికి। పరాయణము పరమధర్మపదముల కెల్లన్. 364

క. భూతదయయు ననహంకా। రాతిశయముఁ గలుగువిమలుఁ డపార్థియశ్చి
త్తాతురుఁడు మాని విధులు న। నీతము లైనను దృఢాత్మనిష్టకతమునన్. 365

క. సంతోషామృతసుఖిత। స్వాంతుం డగు నేని నట్టివాఁడు గృహంబుం
గాంతారదేశమును నొ। క్కంత గ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 366

క. రోగంబుఁ దపంబుఁ బరి। త్యాగంబును గాక యొండు లగునె హితంబుల్
రాగముసరిదుఃఖంబును। ద్యాగముఁ బోలెడిసుఖంబు నరయం గలవే. 367

క. విను కుసుమంబుల వాసిం। చిన నొప్పనికంపు విడిచి చెందును సౌర
భ్యనిరూఢిం దిల లట్టుల। యనఘా సత్కృతముల జీవుఁ డకలంకుఁ డగున్. 368

క. అంతంతకు సత్కర్మము। లెంతయుఁ బెను పొంద జీవుఁ డెక్కుడుచాయం
జింతాకలుష ము వాయఁగ। సంతోషామృతము వాని సంశుద్ధుఁ డగున్. 369

తే. వాఙ్మనోదృష్టికలితపవిత్రవములఁ। గాయచేష్టితములను నన్యాయపథముఁ
బొరయ నీ కున్న సత్పథనిరతి గలుగు। సత్యశమదమాహింసలు సత్పథములు 370

తే. అనఘ మూఢాత్మచిత్తంబునందు విషయ। జాల మత్యంతగాఢసంసక్తి నొందు
లక్కరసము దండాదులఁ జిక్కఁ బట్టు।చందమున దీనిఁ గనుట ప్రశాంతికరము

క. తనగృహమున నభ్యాసం। బున మెలఁగెడునంధుచందమున సంసారం ల
బునఁ దిరుగుమూఢుఁ డెఱుఁగఁడు। వినుతం బగుమోక్షపథము విమలవివేకా. 372

క. వినుము మృణాళంబున నం। టినకొంపి జలంబులం గడిగినను బెడఁబా
సినక్రియ విమలజ్ఞానం। బున సంసారంబు వాయుఁ బురుష నరేంద్రా. 373

క. యోగనిరూఢుఁడు సంగ। త్యాగానంతైకనిరతుఁ డతనికి జనసం
యోగము మృతిదైన్యంబును। భోగాభోగసుఖదుఃఖములు లే వధిపా. 374

ఆ. ప్రకృతి దొలఁగి తన్నుఁ బరికించుజీవుండు।పరముఁ గాంచు నప్పుడు ప్రకృతిసగుణ
తానిరూఢి యడఁగి తన్మయత్వము నొంది। జీనకేవలత్వసిద్ధి యొలయు. 375

క. వినవె కేవలుఁ డగుజీవుఁడు। దనుఁ బరముం గాఁగఁ జూచి తల్లీనత్వం
బున వెలుఁగునది నిరామయ। మనంత మగుపదము నూవె యతులవివేకా. 376

ఆ. జలముఁ గదిసి యుండి జలముచే నార్ద్రింబు। గాక యుండునట్టికమలదళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును స। ద్వ్యాకృతి బొందకుండు వీతదోష. 377

తే. ఇంద్రియంబులు మనమునం దివురఁజేసి। మనసు దిగిచి యహంకారమున నడంచి
బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి బుద్ధి। బ్రకృతిఁ గలఁపఁ దధ్యాసతత్పరత గలుగు 378

తే. తాను దెగునేని బాంధవదారపుత్త్ర। మిత్త్రులనుసజ్జనంబు లేమిటికి విగత
చిత్తుఁడై గుహఁ జొచ్చి నిశ్చింతబుద్ధి।దపవి కానంగ వలదె తన్నుఁ దాన. 378

తే. జరయు మరణంబు మర్త్యునిజన్మ మాది। గాఁగ వెనువెంటఁ దగులునంగంబు వేచి
రేపల్లి సేసెద ననక యేమే లిపుడ చేయుము।(వినుము)గాచు నె మృత్యువు జనుల పనులు

ఆ. ఆశ్మశానగమను లంతియు చుట్టంబు। లగ్నిఁ గలపి మరలు నఖిల మైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱు। యందు మమత బెనుచు నజ్ఞుఁ డనఘ. 381

తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి। కేవలాంగుఁడై నిర్మలభావయుక్తిఁ
దపము గృహమున నేనిఁ దత్పరత నాచ।రించి సంసారజలధిఁ దరించు నరుఁడు 382

ఆ. ఏన కలను నాకు నెవ్వరివానిఁ గా। నాత్మఁ దలఁతు నన్ను నట్టివాని
నెందుఁ గానన్ గాన నెవ్వరివాఁడను। గా ననంగ వలదె మానవీయ. 383

క. కోరికయు నొల్లమియు లే। కేమూపున ఘాతములకు నెగ్గగు తెఱఁగుం
జేరక యకామవృత్తిఁ ద। పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్ 384

క. వినఁ జూడం బడునంద। ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం। ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁ గనున్ 385

క. ఇనుమును గనకము నిందయు। వినుతియు సమములుగఁ గొనుచు వివిధాంగకముల్
దనలోన నడఁచుకమఠము। ననువున నింద్రియము లడఁచునతఁడు గను శివున్ 386

ఆ. హింస లేక యునికి యింద్రియజయము నై। రాశ్య మచపలత్వ మనుగుణములు
నాల్గుఁ గలుగునట్టినరునకుఁ గరతలా। మలక మంతరాత్మమహిమ యెల్ల. 387

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే దొకండు నె
వ్వరిమది యొంచు వ్రాతలఁ దగ వ్రాసిలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫలదోహనకార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలినధర్మములన్ నెఱుంగఁగన్. 388

క. న్యాయమున సంగరంబుం। జేయఁగ శస్త్రాగ్ని దన్నుఁ జెందిన దానం
గాయంబు విడుచుపురుషుఁడు। వే యేటికి మోక్షలక్ష్మి విభుఁ డగు నధిపా. 389

క. తపతోఁ దుల్యం బైనను। మనుజాధిప యధికబలసమగ్రత్వము గ
ల్గిన నని శత్రుని వధియిం। చిన నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. 390

క. పరమర్మభేదంబులు నయ| విరహితములు ధర్మకార్యవిముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలు స| త్పురుషుం డాడఁ డవి సత్యములు గా కునికిన్. 391

క. అతిథిజనులు తమతమవాం| ఛితము లనుభవించునట్లు సేయం గనివం
గృహకృత్యతఁ బొందరె గృహ| పతియును గృహిణియును ధర్మభారమువలనన్. 392

చ. వినుము జరానుబంధమున వెండ్రుకతండముఁ బండ్లు వీనులుం
గనుఁగనయుంన్ జరం బొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణ గా
దనయముఁ బేర్చి ప్రాణముల వన్నెక పోదది రోగ మల్పబు
ద్ధి నరులు చోర్చిన తే రది మనం జొరనీరు సుఖార్థులై బుధుల్. 393

క. పురుషాదికలై తొలఁచుచు| నిరూపణము సేయ నూఁది నిర్దేశింపన్
వెంపు వడక శాశ్వతసుఖ| భరితత నిర్వాణ మనఁగఁబడుఁ బ్రకృతి నృపా. 394

తే. సత్కులంబునఁబుట్టుట సకలవేద| ములు బురాణంబులును శాస్త్రములునుజదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రాభవములు గావు| శీలసామగ్రి లేనిదుశ్చేష్టితునకు. 395

తే. రూపగుణశీలముల ననురూపుఁ డైన| వరున కీక కన్నియఁ దనవలసినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ| తాతనూభవ బ్రహ్మహత్యాసమంబు. 396

క. పాతివ్రత్యము గలిగిన| నాతి యనఁగ నైన మన జనస్తుత వేదో
యాతతధర్మార్థసుఖ| ఖ్యాతులు సద్భాగ్యములనఁ గాదే కలుగన్. 397

క. కులమును శీలము విద్యయుఁ| గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁ గా
వలయు ననుకప్రదానా| కలితంబుగ బ్రహ్మకర్మగతి యిది యధిపా. 398

ఆ. షాత్రి మండ్రి బుధులు గన్య పురుషుఁ గోరి| వతఁడుఁ గన్యఁ గోరఁడు నా సనేయ
నచల మగుపరస్పరానురాగము గని| ప్రేమద మెసఁగఁ జేయుపరిణయంబు. 399

క. కన్య మనంబును జనిసినఁ| గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్న వరుని కిచ్చుట వెల| యన్నట యాసురము సూనె పాండవముఖ్యా. 400

క. బలిమి మెరయు వమఁడు గన్యకుఁ| గలవారిం బొడిచి కరము క్రౌర్యంబున న
ప్పొలతుక దుఃఖింపఁగ వా| రలు వోసలఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా. 401

ఆ. అయిదు తెఱఁగులందు వారయ మూఁడుం| ధములు ధర్మకృతులు ధర్మప్రతి
యాసురంబు రాక్షసావ్యయంబును ధర్మ| మారసంవిధానమాషితములు. 402

తే. మాతృపితృహీన యైనను భాతృరహిత| భావ మెంచిన నచ్చాల పరిణయార్థ
వరణమున కర్హ గా నని మనువులాగ్ర| గణ్య చెప్పుదురు పరిణయకల్పవిదులు. 403

క. నిజదారపరులు సంతత। యజనరతులుఁ గామరోషహంతలు నగుస
ద్ద్విజుల నరసి ధన మిచ్చుట। త్రిజగత్పూజ్య మగు నండ్రు ధీరవిచారా. 404

క. దారిద్ర్యముచేఁ గుందుచు। నేరిని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం
గూరినవిప్రున కర్థిగ। వారనిపయి నీగిఫలము వాగ్గోచరమే. 405

ఆ. అన్నదానసదృశ మగుదాన మెందు నె। న్నఁడును లేదు గావునను విధేయ
మన్నదాన మధికయత్నపూర్వంబుగాఁ। బూని దానిచేఁత పుణ్యతమము. 406

క. పరమజ్ఞానులకొసఁగను। బరఁగిన సజ్జ్ఞుఁడును బోధధరితుఁ డగు నిరం
తరమేరుసమీపస్థితి। హిరణ్మయరుచిఁ గాక మెసక మెసఁగినపగిదిన్. 407

తే. ఇన్నియాచారములలోన నెక్కుడండ్రు। సకలభూతములందును సదయుఁ డగుట
యాదిమును లట్లుగావున నఖిలవర్గ। ములకు దయకల్మి పెద్దయౌ సలక్షణము. 408

క. వినుదానంబులఁ బాపము। లనఘా చెడు దానములకు నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము। మను లధికం బండ్రు పాపములఁ బాపునెడన్. 409

తే. దినము పథ్యంబు గా కుండఁ దవిరి యన్న। పానదానంబు లొదవినభంగిఁ జేసి
యతిథి భుజించుటఁ బోలెను మహితధర్మ। కార్యమొండొకఁడెందునుగలదె యరయ. 410

తే. మనసునను వాక్కునను గాయమునను హింస। నెపుడు మాంసంబు దినుటతో నాలుగిరువె
రెండుఁగులవిను వ్రాహింసవర్తింపఁజేయుఁ। గానకడుఁ గడుమాంసభక్షణముదలఁప. 411

తే. వాజిమేధంబుశతమైన బూజనీయ। కర్మ మందురు మాంసభక్షణమువిడుపు
వినుము చంపుటయును జంపఁ బనుచుటయును। గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప.

ఉ. ప్రాణము లాతనుం గలదె మాంసము ప్రాణులమేనఁ గాక య
మ్మానుల నొంచునప్పుడు మమేయులు సోఁకినమాత్రనె ట్లగున్
దానిఁ దలంపఁగా గలదె తా నదిమానిన హింస లన్నియున్
మానవె యంచు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై. 413

క. దానము ధర్మము దప మి। జ్యానిష్ఠ యనంగఁ గల్గుసత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా। నూనాకృతు లండ్రు శ్రుతుల నూనినపెద్దల్. 414

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో। షింతు ననుటకంటెఁ జెట్ట లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను। మేలు లేదు కర్మజాలకమున. 415

క. భూతముల కలుగు నతనికి। భూతము లఖిలములు వలుగు భూతహితార్థి
భూతముల కభయ మిచ్చిన। పూతాత్మున కభయ మిచ్చు భూతావళియున్. 416

ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు। శౌచమంత్రతంత్రసత్యములును
బంధు లహింసరూపములు గాఁగఁ జెప్పెను। నెల్లకర్మ మను మ్మహింసకలిమి. 417

తే. శస్త్రజీవికయును నరిష్టభాగ। మాహరించుటయును భృత్యు నగయుటయును
బ్రజవివాదంబు వినుచోటఁ బక్షపాతి। గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి. 418

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి। యతిథి వచ్చినఁ బ్రియమున నతనిడప్పి
వోవు నట్లుగ సముచితభోజనంబు। వెట్టు టెల్లపుణ్యములకుఁ బెద్ద దలఁప. 419

క. పరబలము పై నడరి నె। త్తురు వట్టులు వాఱఁ జంపు గురు దురమున న
ప్పురుసఁడినంబును బుణ్యో। త్తర మని వేదములు సెప్పెఁ దనుతిగమధ్యా. 420

క. పోగులయందలిమగఁడము। మారణము బుణ్యలోకమహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింసా। కారం బిట్టి దని నీవ కార్యవిచారా. 421

క. వంచనయును జాడ్యంబును। నించుకయును లేక ప్రభువునిష్ట మెఱిఁగి తాఁ
బంచినపని వెరవునఁ గా। వించినకర్మకరుఁ డొందు విపులధనంబుల్. 422

క. జీవుఁడు జీర్ణశరీరముఁ। బో విడిచి నవంబుఁ బొందఁ బుట్టును పేరం
దా వెలయం దద్దశ జీ। వావలి వర్తించు నిటు గతాగతపదవిన్. 423

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
పలనిభక్తియు నాయువుపాలుపు నిమ్ము
నలుక బొంకు క్రూరత శుచితాపగమము
గురువిరోధ మాయువుఁ గడుఁ గుఱంగఁ జేయు. 424

తే. శుచితము నరునిఁ బరజ్ఞానయుతునిఁ జేయు। దానినక్కృత మల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞానసత్కర్మ మెంత లైన। నఫల మగుఁ గాన శుచిఁవంతుఁ డగుట పలయు

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వాశనంబు నై మదిం
జూచుచు నంతరాత్మ నెడ సొచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం
ద్రోఘము భక్తియుక్తి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 426

క. ఇన్ను దేహియు దేహము వే। ఱను నిశ్చయదృష్టి గల్గువాఁడు సాలున్
మనసు మగిడింప నది ని। గ్రహస్థితిఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్ 427

తే. నాగు నింద్రియవిభ్రాంతి సంహరింతు। రఘము దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు
రవిరళంబుగా ధర్మ మాచరింతు। రఖిలభూతదయాళువై మారఁ గలరు. 428

క. తత్త్వ మనశ్వర మఖిలవి। రత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శత్వంబు హింసకత్వము। దాత్త్విక మై లేదు దేహదళనమున నృపా. 429

క. శరధిపరివేష్టితక్షితిఁ। బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న। ప్పురుషుని దురితంబు లెట్లు వొందఁగ నేర్చున్. 430

క. వనమున వన్యాహారం। బున వర్తించినఁ బదార్థములపై మమతన్
మనమున విడకుండిన న। మ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా. 431

క. వెలిపగఱ గెలుపు గెలుపే। యలఘుమతిన్ గెలువ వలయు నభ్యంతరశ
త్రులఁ దన్విగయము మోక్షము। నలవఱుపం జాలు నొంట నమ్మ లగునే. 432

క. విను మంత్రశ్మశ్రులలో। ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకామం బగువ
ర్తనము విశద మధ్యాయనయ। జనదానంబులును గామసహితములు గదా. 433

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ। బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు
నతఁ డనింధనానలమున ట్లల్లఁ బొందు। నికృతివర్జిత మైననిర్వృతి గృతాత్మ. 434

క. తనువువలన నిష్క్రమణం। బొనర్చి జీవాత్మఁ గాంచుయోగివరుం డ
య్యాను వొదవి యట్లు దన్నుం। గనినప్పుడు జననమరణగతులం దొలఁగున్. 435

క. ముక్తుండు జరామరణవి। యుక్తుం డై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకును సన్నిధ మా। శక్తుం డగుఁ జావు బ్రహ్మచర్యము పేర్మిన్. 436

ఆ. ఒడలియస్థిరత్వ మూహించి యాత్మయం। దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా। గాదిదుఃఖములకు నగపడండు. 437

క. విను యోగయుక్తునకు శ। స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొద లై
చనునట్టి కారములు లే। వనఘు యతఁడు గోరఁ డైంద్రి మహపద మైనన్. 438

క. తనయందు తన్ను లెస్సగఁ। గనుఁగొం గడచిన సుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కర్యము। వినుతానుష్ఠానమునకు విమువమి వలయున్. 439

క. తనరుఁ డేఁగిన తెరవున నే। మ్మన మంతర్వర్తిఁ జేసి మతి బాహ్యగతిం
జనునీ కుండఁగ నది యెం। దనువునఁ బడు నిలుప వలయు నచ్చట దానిన్. 440

తే. అద్వ్యానాదితత్త్వము చక్షురాదికంబు। లైనయింద్రియములకు గ్రాహ్యంబుగాదు
సకలమలవిరోహాద్యపరిసన్నతరము। సుప్రదీపంబు దర్శనం బొనర్చు. 441

క. కలయంగ నెల్లయెడలం। దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నైయాత్మత్వం బు। జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 442

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహసంగంబు। నీవ విడిచి యొవ్వఁ డీయుపాయ
ముల భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి। యగు నొకింత సందియంబు వలదు 443

తే. సత్యమునన భూతంబులు సంభవించు। నంద వర్తించు దాన నడఁగు నిది గు
ణత్రయాత్మకసత్యచరిత్ర మమల। బుద్ధులార సత్యంబుప్రసిద్ధి గనుఁడు. 444

ఉ. బలమును శౌర్యమున్ ముదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి నేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పప్రభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుగ్ర రజఃప్రభూతముల్. 445

క. రాజసగుణములకుం గల। నైజ మెఱుఁగువారు తజ్జనకసైకృతముల్
దీజితములు గావింపఁగ। నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 446

క ధర్మార్థకామగోచర। కర్మములకు సాత్త్వికాదికప్రకరవికా
రోర్ములు హేతువు లగు ని। ష్కర్మతకే తదభిభూతి గారణము సుఁడీ. 447

క. సత్త్వము ప్రదీప మాపర। తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా
తత్త్వము వదలక చిత్తను। తత్త్వకలిత మగు నెలవు గఁడుర్ కృతాత్ముల్. 448

క. శరనిధితరఁగలభంగిం। జొరిఁ జొరి సత్త్వక్రమునన పుట్టు నడంగున్
సురనరధరణీరుహముఖ। చరాచరానేకభూతజాలము లెల్లన్. 449

క. తమము రజస్సుఁ దొలఁగి స। త్త్వమునన రమియించి యగుణతత్త్వముఁ గని స
త్త్వమును దిగవిడుచు వైరా। గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా. 450

క. పరమం బనంగ వేదాం। తగరహస్యాత్మకత వెలుఁగుతత్త్వంబు నిజం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను। పరిణతి గలయతఁడు సర్వపదవిదుఁడు సుఁడీ. 451

క. వృత్తివిశేషమునఁ జనిన। చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి। యుత్తమపురిహాస్య మందుర్ యోగమున మునుల్ 452

క. వినుఁ డత్యక్రాంతం బగు। పని యెల్ల నవిద్య నొలయ బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం। బనఁ జను నది నిర్మమత్వ మారఁ గలిగినన్. 453

క. కోరికలకుఁ జోరక యసం। గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల। సారాత్మకు లీపథమునఁ జనుటకు శక్తుల్. 454

క. పురరక్షణము గృహంబుగ। నగనర చేయంగ వలయు న్మత్కుఁ గలుగుస
త్పురుషుల నిడఁ దగుఁ గుడుపు ని। దుర మెదలగు లోనిపనులతో పరువు లరయన్

క. విను మంత్రిభేదమున న। చ్చినకీడున కనఘ శాంతి సేయు టరిది కా
వున మంత్రులతో మంత్ర। వననియమం బూఁది చెప్ప వలయుం జామ్రా. 456

క. అమృతమయ మృగ్యజుస్సా। మములయుపనిషద్వచస్సమాజములకు సా
ధ్య మగుపురుషోత్తము ని। క్కమురూపగువాని భక్తిగమ్యుఁ దలంతున్. 469

క. నవ్యక్తక్షేత్రంబున। నవ్యక్తాకృతినిరూఢి నాసీనుం డై
భవ్యత నొందఁడు క్షేత్రా। త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. 470

క. ప్రకృతివికృతులను షోడశ। వికారముల వెరసి ప్రకృతివికృతిత్వముఁ బొం
దక యుండఁ గాంచు రెవ్వని। సకలమునులుఁ దలఁతు నట్టిసాంఖ్యాత్మహరిన్. 471

క. అంతశ్చరవహ్నిరుతములు। శాంతములుగఁ జేసి యనలసత్త్వము శమమున్
దాంతియుఁ గలజనములు గను। నంతర్హితుఁ గొలుతు జలశయను యోగాత్మున్. 472

తే. చరణనాభిశీర్షంబులు ధరయు నంత। రిక్షమును దివమును జగచ్చక్షురగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రముల్ దీప్త లెవ్వ। హాత్మునకు నట్టిహరిని లోకాత్ముఁ దలతు

క. మాసర్త్వయనాబ్దమయో। ద్భాసితరూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం
జేసి పొలుపారు శౌరి ను। పాసింతును యోగిభోగ్యబలుఁ గాలాత్మున్. 474

క. సర్వమునందును దానగు। సర్వముఁ దనయందు నుండు సంచారంబుల్
సర్వమునకుఁ దనవలనన। సర్వాత్మకు నట్టివృష్ణిసత్తముఁ దలఁతున్. 475

ఆ. క్షరము లైనభూతసంఘంబులం దెల్ల। నక్షరస్వరూపుఁ డై వెలుంగు
సకలబుద్ధివృత్తిసాక్షి సాక్ష్యాత్మ న। స్పందబోధఘను ముకుందుఁ దలఁతు. 476

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల। గాత్రవ్యాప్తత్వమహిమ గలిగి సమీరా
సూత్రమున జీవుండును। గోత్రము నై సర్వవర్తకుం డగుచుండున్. 477

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం। డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యనఁగా। జననరహితుఁ డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. 478

ఆ. మణిమయములు గనకమయములు రజతమ। యములుమఱియు మృణ్మయాధికములు
నైనపెక్కు పూసలందుఁ దారి డున్నట్లు। భూతకోటియందుఁ బురుషుఁ డుండు.

క. అమృతం బచ్యుత మమలం। బమేయ మవ్యయ మనంత మవ్యాలుఁగు యమా
ద్యముల నలవడినచిత్తము। శమాదికమునఁ బొంద సంవేద్య మగున్. 480

తే. అచలు నాత్మ్మ శరణ్యు సహస్రశీర్షు। నభయకారి నశీర్షు నారాయణుని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు। ధ్రువుని నీశ్వరు హరి భక్తి తోడఁ గొలుతు.

క. కాలముఁ బర్జన్యుండును। నేలయు సస్యంబుఁ గ్రియయు నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ। న్నీల సలుపు దేవదేవుని బ్రణుతింతున్. 482

క. అనలునకు రవికిని శశాం। కునకును గ్రహతారకములకును దేజం బె
వ్వానివలన నావహిల్లెడు। ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్మున్. 483

క. అగమను నబోధ్యుని నఖిల। జగద్భరణుఁ బరు నమూర్తిసాగరునిఁ బ్రబో
ధగరిష్ఠుఁ బంచకాల। జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వశోభితుఁ గొలుతున్. 484

క. వ్యక్తమునకుఁ బ్రభవం బ। వ్యక్తం బాతత్వమునకు నవుల ననువచో
యుక్తికిఁ బరాయం బగు। భక్తపరాధీను భవ్యభావ్యు నుతింతున్. 485

క. జ్ఞానధ్యానపరాయణు। లైనమహాత్ములు జితేంద్రియత్వమహిమ నె
వ్వానిం బొందిన మగలరు। వాని శరణుఁ జొచ్చి బ్రతుకువాఁడ సుకృతినై. 486

క. ఇనునడుమ వెలుంగుచు సో। మునిమధ్యమునం జలత్వముం బొందనిని
ల్పున వెలయుదీప్తి యగువా। ని నిరంజను నంతరాత్మునిం బ్రార్థింతున్. 487

క. సోమార్కమయంబును దా। రామయమును నిత్యసుస్థిరంబును నగుతే
జోమయతత్త్వము నాత్మా। రామత్వంబున నిరంతరంబును జూతున్. 488

క. కోపముఁ గామము రాగ। ద్వేషములును లేక భక్తి దిరమై యేకా
గ్రేషునిఁ గాఁ గొలుతు రవి। శేషమునోనిలయున్నత్తి సిద్ధులు నిన్నున్. 489

క. ఫలములు గోరక కర్మం। బులు సపపుమ నాని విమలబోధాగ్ని నడిం
బొలియించుచు నిర్ద్వంద్వా। త్మలకొను నేకాంతజనులు నినుఁ గందురు హరీ. 490

క. ఏకత్వం బమలత్వ ము। నేకత్వము గలుగునీమహిమచందం బా
లోకింప నిపుణు లగుసు। శ్లోకులకుం బరమపదము సులభము గాదే. 492

సీ. ఇల జలంబులజలంబులు శిఖి శిఖి వాయువున వాయు నంబరంబునను నంబ
రంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి బుద్ధిఁ దగ నొడఁగించి యింత
పట్టును గూడ నవ్యక్తంబుఁ జేర్చి యవ్యక్తంబు నిజభంగి నైనత్రిగుణ
సామ్యావ్యవస్థితి నడిసన్న కారణభూతతన్మాత్రలు పొదున కుండఁ

గీ. దొలఁగ బెట్టుట దొరకొన వలయు దానఁ। బరమమును గేవలము నగుపదముగలిగి
యేన నీ నను నైక్యంపు టెఱుక వోడముఁ। గాత గమనాగమనములు గ్రాఁగిపోవ. 492

క. పరమాత్ముని నారాయణుఁ। జిరంతనుని భక్త శేముషీనిష్ఠాస్వీ
కరణైకాయనుని నమ। స్కరణంబునఁ దలఁతు నతులషడ్విధభూతిన్. 493

తే. పునరావృత్తిరహితుం। డనఘా పరమాత్ముఁ జెందినట్టి పురుషుఁ డ
వ్వినుతావస్థను మోక్షం। బని చెప్పుదు రంతకంటె నధికము గలదే. 494

# మానవసేవాగ్రంథమాల.

## రాజమహేంద్రవరము.

1. కబీరు — ఇందు చరిత్రాంశము వచనముగను, ఉపదేశములు పద్యములుగ నుండును.
   అత్తిలి సూర్యనారాయణ గారిచే రచింపబడినది. 0 2-0
2. బంగాళాదుంప — చిదుడవోలు వేంకటరావు గారి రచితము. 0-2-0
3. అగ్గిపెట్టెలయంత్రశాల — కందుల శ్రీమన్నారాయణ గారి రచితము. 0-4-0
4. లోకపావనశతకము — ఇందలి పద్యములు భక్తిరసము నొలికించును.
   ఆదిపూడి సోమనాథరావు గారిచే రచియింపబడినది. 0-2-0
5. కోటిలింగశతకము — ఇందలి పద్యములు నీతిని, దేశభక్తిని బోధగొల్పును.
   పస్యవోలు అప్పారావు గారిచే రచింపబడినది. 0-3 0
6. స్త్రీలయెడ మనము గావించు పంచమహాపాతకములు —
   నాళము కృష్ణారావు గారిచే రచింపబడినది. 0 1 0
7. వీరమతి — వీరరసప్రధానమైననాటకము. ఇందు దేశాభిమానము,
   స్వార్థత్యాగము, స్త్రీసాహసము ప్రదర్శింపబడును.
   మంగిపూడి వేంకటశర్మ గారిచే రచియింపబడినది. 0 10 0
8. భారతీయసందేశము — స్వదేశాభిమానమును, స్వదేశమాతృభాషలందు గలుగు
   ప్రయోజనములను వెల్లడించు నొక గ్రంథము. 0.1 0
9. భక్తితరంగిణి — ఇందు భగవద్భక్తి, దేశభక్తి, మానవసేవ ముఖ్యముగా
   గూర్చిన పద్యములు గలవు. 0 1-6
10. దేవేంద్రనాథచరిత్రము — అత్తిలి సూర్యనారాయణ గారి రచితము. 0 2 0
11. అనాథాభ్యుదయము — దిక్కులేనివారలకు శాలలను, వారివలన దేశమునకు
    గలుగు మహోపకారములను దెలుపు గ్రంథము. 0-2.0
12. గ్రామ్యవస్త్రములు చేయువిధము — 0-1-0
13. రాజా గురుదాస చరిత్రము — ఇ. సుబ్బకృష్ణయ్య గారి రచితము. 0-1-0
14. ఆనందశతకము — ఇందలి ప్రతిపద్యము భక్తిసారపూరితమై యుండును.
    సూరాబత్తుల సూర్యనారాయణ గారిచే రచింపబడినది. 0-2 0
15. ఉత్తమవివాహము — వివాహభేదములు, ధర్మములు, విధులు దెలుపును.
    పాలపర్తి నరసింహము గారిచే రచింపబడినది. 0-1-0

